# బ్రాహ్మధర్మశిక్ష.

శ్రీ సీతానాథతత్త్వభూషణ
విరచితము.

---

వంగభాషనుండి యాంధ్రీకరింపఁబడినది.

---

౧౯౧౩

మచిలీపట్టణము.

కృష్ణాస్వదేశీముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడి ప్రకటింపఁబడెను.

1000 ప్రతులు.

# విషయసూచిక.



పుట.



బ్రహ్మకృపాహి కేవలం

# బ్రాహ్మధర్మశిక్ష

## ప్రథమపాఠము — వివేకము.

"బ్రాహ్మధర్మము" అను శబ్దార్థమును మీరు క్రమక్రమముగ గ్రహింపఁ గలుగుదురు. కాని ప్రథమమున "ధర్మము" అనుమాటకు నర్థమును గ్రహించుటకుఁ బ్రయత్నింపుఁడు. చేయఁదగిన కార్యముపేరు "ధర్మము". చేయఁదగని కార్యముపేరు "అధర్మము". ఎప్పుడును సత్యమును బలుకుట యుచితము. అసత్యమును బలుకుట యనుచితము. ఇందువలన సత్యమును బలుకుట ధర్మము. అసత్యమును బలుకుట యధర్మము. పరులకు నుపకారము చేయుట యుచితము. పరులకు నపకారము చేయుట యనుచితము. ఇందువలనఁ బరోపకారము ధర్మము. పరాపకారమధర్మము. ఇదేవిధముగ నీశ్వరునియందు భక్తి గలిగి యుండుట ధర్మము. ఈశ్వరునియందు భక్తి లేకుండుట యధర్మము. ఈ కార్యము ధర్మము ఈ కార్య మధర్మమని తెలిసికొనుచున్నప్పుడు, ధర్మాధర్మములను దెలిసికొను శక్తి మనయందుఁ గలదని స్పష్టమగుచున్నది. మనము ధర్మాధర్మముల భేదమును గ్రహించుటయే కాక ఇది ధర్మ మది యధర్మమని నిర్ధారణచే

యుచున్న శక్తిన్నే, ధర్మాధర్మవివేకమని చెప్పుదుము. లేకసంగ్రహముగ వివేకమని చెప్పినను జాలును. ప్రతిమనుష్యుఁడును వివేకమును గలిగియున్నాఁడని సహజముగ మనము గ్రహింపవచ్చును. నీ కలమును గాని, కాగితమును గాని, దొంగిలించిన బాలుని హేయముగఁజూతువు. మఱియును, అన్యాయమన్యాయమని చెప్పుదువు. దొంగతనము నన్యాయమని, లేక యధర్మమని, నిరూపించు శక్తినే వివేకమందురు. తినుటకు నన్నము లేని కడుబీదవానికి దమ్మిడీ యీయుమని నిన్నుఁ గోరినప్పుడు నీతల్లియొద్దకు నీవు పరుగిడివెళ్లుటకుఁ గల కారణమేమి? బీదవానికి దమ్మిడీయిచ్చుట యుచితమని నీవు స్పష్టముగ గ్రహించుటవలననే కదా నీవు నీతల్లియొద్దకుఁ బరుగిడి వెళ్లుటకుఁగల కారణము. ఈ తెలిసికొను శక్తినే వివేకమందురు.

కొంచెము విచారించి చూచినచో, వివేకమను వస్తువన్నత శక్తిగలిగియున్నదని గ్రహింపఁ గలుగుదువు. ఈ వివేకము మన యిచ్ఛగాదు. మన యనిచ్ఛయునుగాదు. ఆఁకలి గలిగినప్పుడు భుజింపవలయునని యిచ్ఛగలిగిన భుజించెదవు. ఆఁకలి లేనప్పుడు భుజింపవలయునను నిచ్ఛయును లేదు. భుజించుటయును లేదు. మామిడిపండును జూచినప్పు డాఁకలి లేకున్నను, తినవలయునను నిచ్ఛగలుగును. దగ్గఱ డబ్బున్నచోఁ గొని తిందువు. కాని, కుళ్లిపోయిన పండయినచోఁ బాఱవేయుదువు. కనుక నిట్టికార్యము లిచ్ఛయున్నఁ జేయుదుము. ఇచ్ఛ లేనిచో మానుదుము. కావున వీనియందు ధర్మాధర్మభేదము లేదు. ఈ పక్షమగు, కార్యములను జేయుమని కాని, చేయవలదని కాని వివేకము కొంచెమైనను జెప్పదు. నీకు జ్వరమువచ్చినమొదల నన్న

ముఁ దినవలదనియును, సగ్గుబియ్యపుజావఁ ద్రాగవలయునని యును వైద్యుఁడు చెప్పినప్పుడు, నీవన్నమును దినినయెడల నీకు జ్వరము తగ్గదు గదా! కాని నీకు సగ్గుబియ్యపు జావఁ ద్రాగవల యునను నిచ్ఛ లేదనుకొనుము. అన్నముఁ దినవలయునను నిచ్ఛ గలదనుకొనుము. ఈ సందర్భమున నీ యిచ్ఛానుసారముగఁ జేసినయెడల, ననఁగా సగ్గుబియ్యపు జావను ద్రాగక యన్నమును భుజించినచో నీ వధర్మమును జేసినవాఁడ వగుదువు. కనుక నిట్టి సమయములయందు సగ్గుబియ్యపుజావ ద్రాగుట ధర్మమనియును, నన్నమును దినుట యధర్మమనియును, నీవు దెలిసికొనుచున్నావు. అనఁగా వివేకము చెప్పుచున్నది. భావించి చూచినయెడల నిట్టి సమయములలో వివేకము నీయిచ్ఛకు వ్యతిరేకముగ బోధించుచున్నది. అనఁగా నీ కేది యనిష్టమో, దానిని జేయుమని చెప్పుచున్నది. వివేకము మనలోనే యున్నది. ఇచ్ఛయును మనలోనే యున్నది. ఇట్టి సందర్భములలో వివేకమునకును, నిచ్ఛకును నెట్టికలహము సంభవించుచుండునో చూడుము. ఇందు వలననే వివేకమను వస్తువున కద్భుతశక్తి గలదని చెప్పి యున్నాను. నీవు యిచ్ఛాప్రేరణను వినినయెడల, ననఁగా సుందరముగు బంతిని గొనవలయు ననుకొని కొనకున్నను నీవు మంచి వాఁడవనికాని చెడ్డవాఁడవనికాని యిచ్ఛ చెప్పదు. ఇచ్ఛపూర్ణ ముగానిచో నీ మనస్సునకుఁ గష్టముగలుగు ననుమాట సత్యమే యయిన నందువలన నీవు దుష్టబాలుఁడవని, లేక దుష్టబాలికవని, తలంచుకొనఁగూడదు. కాని వివేకముయొక్క ప్రేరణను వినినయెడల నీవు క్రమక్రమముగ దుష్టబాలుఁడవు లేక దుష్టబాలికవని తెలిసికొందువు. వివేకముయొక్క ప్రేరణను వినని

వానిని దుష్టుఁడని సహజముగ గ్రహింతువు. జ్వరము వచ్చిన ప్పుడు మందుఁదినక సగ్గుబియ్యపుజావ త్రాగక వైద్యుఁడు నిషే ధించిన వస్తువులను దినినచో, దుష్టబాలుఁడు లేక దుష్టబాలిక యని పరులనుటయే కాక, నీవును దుష్టుఁడనని తలంచెదవు. ఇది యద్భుత వ్యాపారముగదా? మనయిచ్ఛ మనలను మెచ్చుకొ నదు, నిందింపదు. వివేకము ప్రకారము ప్రవర్తించినచో "బా గుగఁ బ్రవర్తించితివి, నీవు మంచివాఁడవు" అని వివేకము మె చ్చుకొనును. వివేకము ప్రకారము ప్రవర్తింపనిచో "అన్యాయ ముగఁ బ్రవర్తించితివి, మంచివాఁడవుగావు" అని వివేకము నిం దించును. మనము ధర్మము నాచరించువానిని మెచ్చుకొనుట కును నధర్మము నాచరించువానిని నిందించుటకును మనలోని వివేకమేకదా కారణము. ఇందువలన వివేకము మనలోని వస్తు వయినను మనపై నెట్టియధికారమును గలిగియున్నదో చూడు ము. వివేకము మనయిచ్ఛానిచ్ఛలకు లోఁబడియుండునది కాదు. అనేకసమయములయందు వివేకము మన యిచ్ఛానుసారముగఁ జేయఁ దలచిన కార్యములను నిషేధించును. అనిష్టములగు కార్యములను జేయనాజ్ఞాపించును. ఉదయమున నిదుర లేచుట కిచ్ఛలేకున్నను, వివేకము నిదురలెమ్మని చెప్పును. చదువుట కిచ్ఛలేనప్పుడు చదువుమని చెప్పును. చదువుకొను సమయమున నాడుకొనవలయునని యిచ్ఛ గలిగినచో, నాడు కొనవలదు, చదువుకొనుమని చెప్పును. చేసినతప్పును దాచుటకు నబద్ధము చెప్ప నిచ్ఛగలిగినచో నబద్ధము చెప్పఁగూడదని నిషేధించును. మఱియు నబద్ధమును బలికినయెడల నన్యా యమని చెప్పును. ఎవరినైనను గోపమునఁ దిట్టినచోఁ దప్పని

చేసితివని వివేకము చెప్పును.

ఇందువలన ధర్మాధర్మములను నిరూపించు శక్తియగు వివేకము మనలోని వస్తువయినను, దీనిని నా వస్తువని చెప్పుటకు వీలు లేదని గ్రహించుచున్నాము గదా? ఈ వస్తువు మనపై బాధ్యతను గలిగియున్నది. కనుకనే వివేకము మనకుం గర్తయు బూజ్యమును నైయున్నది. ఇంకను విచారించి చూచిన యెడల మనకుం బూజ్యులును మనపై నధికారముగలవారు నగు తల్లి, తండ్రి, గురువు, మొదలగు వారును, వివేకాధీనులని బోధపడంగలదు. వివేకముయొక్క ప్రేరణవలననే, వారు మనలను ధర్మకార్యములం జేయవలసినదనియుం నధర్మకార్యములం జేయంగూడదనియును జెప్పుటయే కాక ధర్మకార్యములను జేసినప్పుడు మెచ్చుకొందురు. అధర్మకార్యములను జేసినప్పుడు నిందింతురు. వివేకము ప్రేరేపించినటుల వారు మనకుం జెప్పుచుండుట వలన వారును వివేకాధీనులు. కనుక వివేక మందఱకు నధికారి.

## ప్రశ్నలు.

౧ దేనిని ధర్మమందురు? దేనిని నధర్మమందురు?

౨ ధర్మాధర్మముల కుపమానములను రెంటిని జూపుము.

౩ దేనిని వివేకమందురు? ఉపమానములతో బోధింపుము.

౪ ఇచ్ఛానిచ్ఛలకును వివేకమునకును గలభేదమేమి?

౫ "వివేకము మనపై నధికారమును గలిగియున్నది." అనంగా నర్థమేమి?

౭ "వివేకము మనలను మెచ్చుకొనును నిందించును" దీని నుపమానముల మూలముగ బోధింపుము.

౮ "వివేకమందఱకు నధికారి— మనకుఁ బూజ్యులయిన వారికి నధికారి" ఈ వాక్యమును మనసునకుఁ దెలియునటులు బోధింపుము.

## ద్వితీయపాఠము-బ్రాహ్మము. (లోపల)

వివేకము మనలోని వస్తువయినను మనవస్తువని చెప్పుటకు వీలు లేదనియును, వివేకము మనపై నధికారమును గలిగియున్నదనియును ప్రథమపాఠమునఁ జదివియున్నాము. ఈ వాక్యార్థమును బాగుగ బోధపఱచుకొనుఁడు.

నీ వేదో యొక చీకటియింటిలోనికి వెళ్లితి వనుకొనుము. ఇంటియం దెవరును లేరను విశ్వాసము కలిగి యింటిలోఁ బ్రవేశించిన తర్వాతఁ జీకటివలన నేమియును జూడఁజాలవు గదా? రెండు మూఁ డడుగులు వేసి వేయక ముందే నీయిచ్ఛానుసారము నడకసాఁగనిచో నీ వేమని తలంతువు? నీనడక సాఁగకుండుటయే కాక నీయిచ్ఛకు వ్యతిరేకముగ నడవవలసి వచ్చినప్పు డేమని భావింతువు? ఇది నిర్జనగృహముగాదనియును ఇంకొకఁ డిచ్చటఁగలఁ డనియును, నీతఁడే నీయిచ్ఛానుసారముగ నడువనీయక నీయిచ్ఛకు వ్యతిరేకముగ నడిపించుచున్నాఁ డనియును దలంతువు. విచారించిచూచినచో నీమనస్సునం దిట్టిచర్య జరుగుచున్నదని నీకుఁ దెలియుట లేదా?

ప్రథమమున మన మనస్సునందు మనస్సుతప్ప నింకేమియు లేదని మనము భావింతుము. కాని, వివేకముయొక్క చర్యలను జూచిన నాశ్చర్యము బొందుదుము. వివేక మనేక సమయములయందు మనయిచ్ఛకు నాటంకమును గలిగించును. అనిష్ట కార్యములఁ జేయఁ బ్రేరేపించును. అనేక సమయములయందు మనకుఁ బ్రియములగు కార్యములను నిందించును. అప్రీతికరములగువానిని మెచ్చుకొనును. ఇందువలన మన మనోగృహమున మనస్సొక్కటియే వాసము చేయుట లేదనియును, మనస్సుతోఁ గూడ నింకొకఁడు నివసించుచున్నాఁడనియును దెలిసికొనుచున్నాము. ఆయనను మన కన్నులతోఁ జూడఁజాలమనుట వాస్తవమేకాని, ఆయన కార్యములను జూచి యాయన యున్నాఁడని గ్రహింపఁ గలుగుదుము. మనుష్యుఁడు కనుపడని చీఁకటి గృహమునందుఁ గార్యమునుబట్టి మనుష్యుఁడున్నాఁడని గ్రహించు విధముననే, మనోగృహమునం దెవరిని జూడఁజాలకున్నను, కార్యములవలన నిచ్చట నొకఁడున్నాడనియును, నాయన వివేకము వలన మనపైని యధికారమును గలిగియున్నాఁడనియును, దెలిసికొనుచున్నాము.

ఆయన జ్ఞానమయుఁడనియును మన్ను, నీళ్లు, గాలి మొదలగు నచేతన వస్తువులవంటివాఁడు గాఁడనియును, విచారించిన కొలఁదిని స్పష్టముగఁ గ్రహింపఁ గలుగుదుము. దొంగతనము చేయుటకును నబద్ధమాడుటకును, వ్యర్థసమయమున నన్నముఁ దినుటకును, బ్రయత్నించినప్పు డాయన వివేకము వలన నీకార్యములు చేయుట యన్యాయమని చెప్పును. ఇందువలన నాయనకు జ్ఞానము గలదనుట విస్పష్టముగదా. చతుష్పాదులకు

నిచ్ఛలేనపుడు చదువుమని చెప్పును. మిఠాయికై నీయొద్ద నున్న డబ్బును బీదవానికి యిచ్చినయెడలఁ బ్రశంసించును. ఎవరినైనను గోపమునఁ దిట్టినచో నన్యాయమని నిందించును. కాన నీదృష్టాంతముల వలన నాయన మహాజ్ఞానియని చెప్పుట కణుమాత్రమైనను సందేహముండునా? మనోగృహమందుండు జ్ఞానస్వరూపుని మనము బ్రహ్మమనియు నీశ్వరుడనియుఁ బరమేశ్వరుఁడనియును బిలుచుచున్నామని తెలిసికొనవలయును. మనము కన్నులతో నీశ్వరుని జూడఁజాలము. చెవులతో నీశ్వరుని వాక్యములను వినఁజాలము. హస్తములతో నీశ్వరుని ముట్టుకొనఁజాలము. ఏయింద్రియముతోడను నీశ్వరుని దెలిసికొనఁజాలము. అయినను ఆయన యున్నాఁడని గ్రహించుచున్నాము. అందువలన నేవస్తువు నింద్రియముల మూలమునఁ దెలిసికొనుటకు వీలు లేదో, యేవస్తువును మన మతీంద్రియవస్తువని చెప్పుచున్నామో, యట్టివస్తువును దెలిసికొనుశక్తి మనలోఁ గలదని తేలుచున్నది. అతీంద్రియవస్తువును దెలిసికొను శక్తిని "ప్రజ్ఞ"యని చెప్పుదురు. ఈ "ప్రజ్ఞ" మన మనస్సుతోడనే జన్మించినది. అనఁగాఁ బరమేశ్వరుఁడు మన మనస్సును సృష్టించినప్పుడే యీ "ప్రజ్ఞ"ను సృష్టించి యున్నాఁడు. ఇందువలననే కొందరు "సహజజ్ఞాన"మని చెప్పుచున్నారు. మన మనస్సుతోడ నిది జన్మించుటవలన సహజజ్ఞానమను చున్నారు. వివేకమునకువలె సహజజ్ఞానమునకును నద్భుతశక్తి గలదని మనము సులభముగ గ్రహింపఁ గలుగుదుము. మనకీశక్తియుండుటవలననే యింద్రియాతీతమగు వస్తువును దెలిసికొను చున్నాము. ఈ శక్తి వలననే "వివేకము" మనవస్తువు గాదనియును, మన నిజ

శక్తియునుగాదనియును, బరమేశ్వరుని శక్తియనియును గ్రహించుచున్నాము. "ప్రజ్ఞ" లేక "సహజజ్ఞానము" వలన మనమెట్టి విషయములను గ్రహింపఁగలుగుదుమో క్రమక్రమముగఁ జూడఁగలము. ఎవఁడు వివేకముచే మనస్సుపై నధికారమును గలిగి యున్నాఁడో, వానినే బ్రహ్మమని చెప్పుచున్నారు. ఆయన జ్ఞానవంతుఁడు. ఆయన మన యిచ్ఛానిచ్ఛల నెరుగును. మనకోరికలను గ్రహించును. కొంచెము విచారించినచో నాయన సంబంధము నింకను దెలిసికొనఁ గలుగుదుము. వివేకముయొక్క కార్యములనుజూచి యీశ్వరుని స్వభావమును నీశ్వరుని యిచ్ఛలను మనము దెలిసికొనఁ గలుగుదుము. వివేకమెప్పుడును దుష్టకార్యములను జేయఁబ్రేరేపింపదు. సర్వదా మంచికార్యములే చేయుమని ప్రేరేపించుచుండును. దుష్టయోజన చేసినప్పుడుగాని, యేపిల్లవానినయినను గొట్టదలచినప్పుడు గాని, వివేకము పాపమని చెప్పును. కఠినమగు మాటలనుగాని యబద్ధపు మాటలనుగాని, పలుకుటఁ బాపమని వివేకము చెప్పును. పోట్లాడుట, వెక్కిరించుట మొదలగు పనులను జేయవలదని వివేకము చెప్పును. వివేకము చెడుచింతలను జెడువాక్కులను జెడుకార్యములను నిషేధించును. మంచి తలంపులను, మంచి వాక్కులను, మంచికార్యములను జేయుఁ బ్రేరేపించును.

ఇందువలన మన మీశ్వరుని యిచ్ఛా స్వభావములను సులభముగ గ్రహింపఁ గలుగుదుము. ఈశ్వరుఁడు చెడుయోజనకుఁ జెడువాక్కులకు జెడుకార్యములకు విరోధియనియును, మంచి తలంపులును, మంచిమాటయు, మంచికార్యములయుఁ బక్షముం దుండుననియును దెలిసికొనుచున్నాము. అనఁగా సంక్షేపముగ

నీశ్వరుఁడు పాపరహితుఁడు పవిత్రుఁడునని చెప్పినఁజాలును. నిర్దయుని ప్రేమవిహీనుని, బవిత్రుడని చెప్పుటకు వీలు లేదుగదా? ఇందువలన నీశ్వరుఁడు దయాళుఁడనియు, నెల్లరను ప్రేమించువనియును, మనము సులభముగ గ్రహింపవచ్చును. నిష్ఠురమగు యోచనలను, మాటలను, గార్యములను క్షమించువాఁడను గాననియును, సమస్త జనులయొక్క మంగళమును గోరుచు, సమస్త జనులయందు దయనుజూపుచు, సమస్త జనులయెడ దయతో వర్తించుచుండుటయె, నాయిచ్ఛయని, మనము వివేకముచేఁ బ్రేరేపింపఁ బడుచున్నప్పు డీశ్వరుని దయాళుఁడని చెప్పుట కణుమాత్రమైనను, సందియము లేదు. ఈశ్వరుని దయాళుత్వమునుగూర్చి విపులముగఁ బిమ్మటఁ జెప్పబడును. మనము ప్రజ్ఞావివేకములచేఁ బ్రహ్మమును దెలిసికొనుచున్నామో యాబ్రహ్మము దయామయుఁడు, పవిత్ర స్వభావుఁడునని గ్రహింపుఁడు.

ప్రశ్నలు.

౧ అంధకారగృహమున నీవుగాక యింకొకఁడు గలఁడని గ్రహింపఁగలుగు విధమెద్ది?

౨ మన మనోగృహమునందు మనస్సుగాక, యింకొకఁడు గలఁడని గ్రహింపఁగలుగు విధమెద్ది?

3 "వివేకము మనవస్తువుగాదు, మనశక్తియునుగాదు" ఈవాక్యమునకు నర్థమేమి?

౪ జ్ఞానస్వరూపుఁడగు నీశ్వరుఁడు మన మనోవాంఛల దెలిసికొనుచున్నాఁడని గ్రహించుటెట్లు?

౫ ఈశ్వరుని దెలిసికొనుశక్తికిఁ బేరేమి?

౬ దీనిని సహజజ్ఞానమని యేలచెప్పుదురు?

౭ "అతీంద్రియ వస్తువు" అనఁగా నర్థమేమి?

౮ ఈశ్వరుని స్వభావమేమి?

౯ ఈశ్వరుఁడు దయామయుఁడు పవిత్రుఁడునని తెలిసి కొనుటకు మార్గమెద్ది?

## తృతీయ పాఠము. బ్రహ్మము. (వెలుపల)

ఈశ్వరుఁడు మనలోపల నున్నాఁడని గ్రహించితిమి. ఇప్పుడు మన వెలుపలనుగూడ నీశ్వరుఁ డున్నాఁడని మనము గ్రహింపవలయును. కార్యముండఁగనే కర్త యుండవలయును. కార్యము తనంతటఁ దానుగఁ గాదు. కనుకఁ గార్యమునకుఁ గర్త యుండితీరవలయునను సంగతిని మనము సహజముగనే గ్రహింపఁ గలుగుదుము. మనమేదయిన కార్యమును జూచినప్పుడు, కర్త గనుపడకున్నను, నీకార్యమునకుఁ గర్త యొకఁడున్నాఁడని నిశ్చయించుకొందుము. నీవుగృహమునందు గూర్చుండి కిటికీలోనుండి చూచునప్పుడు గదలుచున్న యొక కఱ్ఱచివర మాత్రమే కనుపడుననుకొనుము. కఱ్ఱచివర మాత్రమే కనుపడుచున్నను గఱ్ఱ తనంతటఁ దానుగఁ గదలుచున్నదని నమ్ముదువా? ఈకార్యమునకుఁ గర్త లేదనుకొనెదవా? కర్తను జూడకున్నను నీకార్యమునకుఁ గర్త యొకఁడున్నాఁడనియును, నెవఁడో యొకఁడు చాటున దాఁగి కఱ్ఱనాడించు చున్నాఁడనియును సులభముగఁ దెలిసికొనఁ గలుగుదువు.

"కర్త లేక కార్యముగాదు" అను నంశమును మనము "ప్రజ్ఞ" లేక "సహజజ్ఞానము" వలన స్పష్టముగఁ దెలిసికొనుచున్నాము. మనము ప్రతిముహూర్తమును జగత్తునందు జరుగుచున్న గణనాతీతములగు కార్యములను జూచుచున్నాము. మన శరీరమునందు రక్తము నదీప్రవాహమువలె సర్వదా పారుచున్నది, మనముదినుపదార్థము లుదరమునందు జీర్ణమై రక్తము మాంసము, మొదలగు రూపములను ధరించి శరీరాభివృద్ధియును శరీరరక్షణమును జేయుచున్నవి. సర్వదా గాలివీచుచుండుట వలన మనప్రాణములు నిలుచుచున్నవి. మేఘములు వర్షించుచున్నవి. ఇందువలన భూమి శీతలమగుచుండుటయేగాక నదులు పుట్టుచున్నవి. భూమినుండి సస్యములు ఫలవృక్షములు పుట్టి పెరుగుచున్నవి. సస్యములధాన్యములను, ఫలవృక్షములపండ్లను దిని మనముజీవించుచున్నాము. అగ్ని మండుచున్నది. అందువలన భోజనపదార్థములు పక్వమేగుచున్నవి. సూర్యుఁడు వెలుతురును వేఁడిమి నిచ్చుచున్నాఁడు. భూమి బాతివలె దనచుట్టు దాను దిఱుగుచు సూర్యునిచుట్టు తిఱుగుచున్నది. ఇందువలన రాత్రింబవళులను భేదమును, హేమంతము గ్రీష్మము, మొదలగు ఋతువుల పరివర్తనములును గలుగుచున్నవి. ఈవిధముగ గణనాతీతకార్యములు ప్రపంచమునందుఁ గలుగుచున్నవి. ఈగణనాతీతకార్యములన్నిటికిని గర్తయొకఁడున్నాఁడని చెప్పుట కణుమాత్రమైనను సందియము లేదు. ఎందువలన ననఁగా గర్త లేక కార్యము జరుగుటకు వీలులేదు.

కాని పైన చూపించిన యుదాహరణముల వలన నాకకముగా నచేతన వస్తువుల వలన నీకార్యములు జరుగు

చున్నవని తోఁపవచ్చును. శరీరమునందు రక్తప్రవాహము ప్రవహించుచున్నదని చెప్పినప్పుడు రక్తము తనంతటఁ దాను గాఁ దిరుగుచున్న దనియును, నెవఁడును జ్ఞానపూర్వకముగ రక్తమును బ్రవహింపఁ జేయుచుండుట లేదనియును దోఁచ వచ్చును. "వాయువు వీచుచున్నది" అనునప్పుడు, వాయు వచేతన వస్తువనియును దనంతటఁ దాను వీచుచున్నదిగాని యెవఁడును గాని, తెలిసికొని, గాలిని వీచునటులు చేయుచుండ లేదనియును దోఁచవచ్చును. మనకన్ను లచేతనవస్తువులను మాత్రమే చూడఁ గలవు. మనయింద్రియము లచేతనవస్తువులను మాత్రమే, తెలిసి కొనఁగలవు. 'అందువలననే మన మచేతన వస్తువుల మఱుఁగున నేమియు లేదని కొందరగ భావింతుము. కాని, పరిశీలించి చూచినచో నిటులు భావించుట శుద్ధభ్రమయని స్పష్టపడును. రక్తము మొదలగునవి తమంతటఁ దాము తిరుగుచున్నవను శంక దోఁచవచ్చునని చెప్పియున్నానుగాని, విచారించి చూచిన యెడల రక్తము వాయువు నగ్ని మొదలగునవి తమంతటఁ దాముగఁ బనిచేయుచుండుట లేదనియును, జ్ఞానమయుఁడగు నొక పురుషుఁడు వీనిని నడిపించుచున్నాఁడనియును దెలిసికొనఁగలుగుదుము. జగత్తునందుజరుగు సకలకార్యముల స్వభావములను జూచినచో నీ సకలకార్యములకు నచేతన వస్తువు కర్తగాదనియును, జ్ఞానమయుఁడగు మహాపురుషుఁ డొకఁడీకార్యము లన్నిటికిని కర్తయైయున్నాఁడనియును గ్రహించెదము. కొన్నికొన్ని కార్యములను జూచినప్పు డీ సకలకార్యములకును కర్తయగు వాఁడు జ్ఞానవంతుఁడని విస్పష్టముగ గ్రహింపఁ గలుగుదుము. ఆ విధమగు కార్యోపమానములఁ గొన్నిటిని జూపించెదను.

జ్ఞానవస్తువును జూడఁజాలవుగాని, నీకుఁగల జ్ఞానమును నీ మనస్సుచే గ్రహింప గలుగుదువు. కాని యితరుల జ్ఞానము నెటుల గ్రహింపఁ గలుగుదువు? నీవు నీతలిదండ్రులను జూడఁగలవు గాని, వారిజ్ఞానమును జూడఁజాలవు. అటులయినచో వారికి జ్ఞానముగలదని యెటులు గ్రహించుచున్నావు? వారికార్యముల మూలమున వారిజ్ఞానమును దెలిసికొనుచున్నావు. నీ తల్లి యన్నము, కూర, పళ్లెరమునందుఁ బెట్టుకొని నీయొద్దకువచ్చి యాపళ్లెరమును నీయొద్దఁ బెట్టినప్పుడు నీవుకార్యమును మాత్రమే చూచుచున్నావు. ఈకార్యమునుబట్టి నీవు బాగుగ భావించి చూచినయెడల నీవు భోజనమును భుజించుట వలన నీయాఁకలి దీరువనియును, శరీరమునకు బలముగలుగునని యును భావించి నీయొద్ద భోజనముఁ బెట్టినదని స్పష్టముగ గ్రహింపఁగలుగుదువు. ఇచ్చటఁ గార్యమువలనఁ గర్తయొక్క జ్ఞానమును, నిచ్ఛయు, విస్పష్టముగ నెటులు తెలిసికొనుచున్నామో చూడుము! నీతల్లి యీవాక్యములను జెప్పినచో, నా చెప్పుటయును, గార్యమే కాని జ్ఞానముగాదు. శబ్దసమూహము జ్ఞానముగాదు. శబ్దసమూహ మిచ్ఛయునుగాదు. కాని, శబ్దములను వినునప్పుడు శబ్దముల నుచ్చరించువానికి జ్ఞానమును నిచ్ఛయును గలవని గ్రహింతుము. ఈస్థలమునందుఁ గార్యమువలనఁ గర్తయొక్క జ్ఞానమును దెలిసికొను విధమువలెనే, బాంధవులు, చుట్టపక్కములు తోడిబాలురు మొదలగు వారల కార్యముల వలననే వారిజ్ఞానమును దెలిసికొనుచున్నాము. కొన్నివిధములగు కార్యములయందు జ్ఞానమును నభిప్రాయమును ప్రకాశమానమగుచుండును.

ఏకార్యములు మనుజులవలనఁగాని, యితర జంతువుల
వలనఁగాని నెఱవేఱుటలేదో, యట్టికార్యముల యందును నీ
విధమగు జ్ఞానప్రకాశము గలదో లేదో విచారించి చూచిన యె
డలఁ దెలియును. తల్లిగర్భమునుండి శిశువు పృథివికి వచ్చుటకు
నావశ్యముగఁ గర్తయొక్కఁడుండి తీరవలయును. ఈకర్తను గన్ను
లు చూడఁజాలవు. కాని, వాని కార్యస్వభావములను యోజించి
చూచినయెడల నాయనకు జ్ఞానముగలదో లేదో స్పష్టమగును.
శిశువుయొక్క నేత్రముల విషయమును భావింపుము. శిశువుయొ
క్క నేత్రములు చూచుటకు నిర్మింపఁబడినవి. అనఁగా నలుదిక్కుల
నుండు సమస్త వస్తువులను బాగుగఁ జూచునట్లుల నిర్మింపఁబడి
నవి. కానఁ గన్నులు చూడఁగలందులకుఁ గాను నుద్దేశింపఁబడి
నిర్మింపఁబడినవని బాగుగ దెలిసికొను చున్నాము. అట్లులయి
నచో "చూడఁగలందులకు" నను శబ్దమున కర్థమేమి? "చూడ
గలందులకు" అనఁగా "చూడవలయునను నభిప్రాయము" లేక
"చూచునని మనమునఁదలఁచి" అని తేలుచున్నది. ఎవరి కీ యభి
ప్రాయము? ఎవఁడీవిధముగ మనమునఁ దలఁచెను? "ఈ కన్నుల
తోడ శిశువుచూచును." అను నీవాక్యమెవరి మనములోనిది?
శిశువున కీయభిప్రాయము లేదనియును, శిశువేవిధముగఁ దలం
ప లేదనియును మనము సహజముగ గ్రహింపఁ గలుగుదుము.
శిశువుతల్లిదిగూడ నీయభిప్రాయము గాదనియును దేలుచున్నది.
ఎందువలననఁగా శిశువుతల్లి శిశువుచూచునను దలంపున
శిశువుయొక్క కనులను నిర్మించియుండలేదు. ఎవఁడు శిశువును
సృష్టించియున్నాఁడో యాయనచే యీయభిప్రాయమని స్పష్ట
ముగఁ దేలుచున్నదిగదా? కన్నుల మూలమునఁ జూచుఁగాక

యనితలంచి యాయనే శిశువునకుఁ గన్నుల నిచ్చియున్నాడు. ఇందువలన శిశువును సృష్టించినవాని యభిప్రాయమును జ్ఞానమును మనము విస్పష్టముగఁ దెలిసికొనుచున్నాముగదా. శిశువును నిర్మించిన వానిని మనము చూడలేనిమాట వాస్తవమె. కాని యాయన కార్యములయందు జ్ఞానప్రకాశమును స్పష్టముగఁ జూచుచున్నాము.

శిశువుయొక్క చెవులు ముక్కు నోరు మొదలగువాని విషయములను భావింపుము. కొంచెము వయసు వచ్చునప్పటికి దంతములు వెలుపలికి వచ్చును. కాళ్ల, దంతముల విషయమును భావింపుము. ఉదరమునందుండు సక్భ్యతయంత్రమునందు మనము భుజించు పదార్థములు జీర్ణమై, రక్తము, మాంసము వెండ్రుకలు, గోళ్ళు, ఎముకలు మొదలగునవిగా మారుచుండును. ఈ యుదరమందుఁగల యంత్రముయొక్క విషయమును భావింపుము. ఈ సమస్త కార్యములయందును గర్తయొక్క యభిప్రాయమును, జ్ఞానమును బ్రకాశమాన మగుచుండుటను జూచుచున్నాము. సమస్తవస్తువుల నీయన సృష్టించియున్నాఁడు. మఱియును, శరీరమునకు జీవమునిచ్చి సముదాయ వస్తువులను రక్షించుచున్నాఁడు. ఆయనకుఁగల జ్ఞానమును స్పష్టముగఁ దెలిసికొనుచున్నాము. ఈ జ్ఞానమయుని మనము, బ్రహ్మము, ఈశ్వరుఁడు పరమేశ్వరుఁడునని పిలుచుచున్నామని యెఱుఁగునది. ఈయన వివేకము వలన మనకు ధర్మము, నధర్మమును దెలుపుచున్నాడు. ఈయన మనశరీరముల నిర్మించి ప్రాణము నొసంగి యాహార పదార్థములను, వాయువును, నిచ్చి రక్షించు

చున్నాఁడు. ఈయనయే జగత్తునందలి సమస్త వస్తువులను నడిపించుచున్నాడు.

గాలి తనంతటఁ దానే వీచుచున్నదిగాని, వీచుటకు నేవిధమగు జ్ఞానప్రకాశమును బొందుటలేదని ప్రథమమున దోఁచవచ్చును. కొంచెము భావించిచూచినచో, నభిప్రాయము జ్ఞానమును బొందియె, గాలివీచుచున్నదని తెలిసికొనఁ గలుగుదుము. గాలివీచుటవలన నలుదిక్కుల యందలి దుర్గంధము దూరమగును. రోగనివారణమగును. మఱియును గాలి మన ముక్కులలోనుండి శరీరమునందుఁ బ్రవేశించి చేయు కార్యములత్యద్భుతములు. గాలి మన శరీరమునందుఁ బ్రవేశించుట వలననే మనము బ్రతుకుచున్నాము. ఒక ముహూర్తకాలము మన నిశ్వాస మాఁగిపోయినచో మనము చచ్చిపోదుము. ఇందువలన గాలి సర్వదా యెందుకువీచుచున్నదో గాలిసర్వదా మన శరీరమునం దెందుకుఁ బ్రవేశింపుచున్నదో స్పష్టముగ బోధపడుచుండుటలేదా? మనము బ్రతుకుట కొఱకుఁగాను గాలి యనుక్షణమును వీచుచు సర్వదా మనశరీరమునందుఁ బ్రవేశించుచు, మనలను బ్రతికించుచున్నది. ఇచ్చట "కొఱకు" అను మాటకు నర్థమును భావింపుము. "కొఱకు" అనగా నిచ్చట "నభిప్రాయము" అనియేకదా యర్థము? ఇదెవరి యభిప్రాయము? ఇదిమనయభిప్రాయముగాదు. కారణము మన యిచ్ఛ వలన గాలికొంచెమైనను వీచదు. వాయు వచేతన వస్తువగుట వలన నీయభిప్రాయము వాయువునకు లేదు. ఎవఁడుగాలిని వీచునటులు చేయుచున్నాఁడో యాయనదే యీ యభిప్రాయము. ఆయన ప్రాణికోటి గాలిని పీలిచి బ్రతుకు చుండునుగాక యను

నిశ్చయము గలిగి గాలిని బ్రసరింపఁ జేయుచున్నాఁడు. అయినచో నిపుడు గాలి తనంతటఁ దానుగ వీచుచున్న దనియును వీచుటకు నేవిధమగు జ్ఞానప్రకాశమును బొందుట లేదనియును మన కాకస్మికముగ దోఁచిన సంగతి కేవలము భ్రమయని విస్పష్టముగ దెలిసికొనుచున్నాము. ఇంకను నిపుడు జగత్తునందలి యితర కార్యముల విషయములను భావించి చూతము. అగ్ని, సూర్యుఁడు, వర్షము, నదులు మొదలగు వాని విషయములను భావించిచూచినచో నసమస్త కార్యముల యందును నీశ్వరుని యభిప్రాయమును జ్ఞానమును బ్రకాశమానమగుచున్నటులు సులభముగఁ దెలిసికొందుము.

ఈశ్వరుని మనము కన్నులతోఁ జూడఁజాలము. అన్యేంద్రియములవలననైనను గ్రహింపఁజాలము. అయినను నాయన యున్నాఁడనియును నాయనసర్వదా చేయుకార్యములను, నాయన దెలిసికొనువానిని నాయన యిచ్ఛలను మనము దెలిసికొనుచున్నాము. ఈ తెలిసికొనుశక్తినే ప్రజ్ఞయని చెప్పియున్నాను. ప్రజ్ఞయెట్టిశక్తిని గలిగియున్నదో చూతుము? ఇదిమన యింద్రియముల ద్వారమున దెలిసికొనుటకు వీలుగాని వస్తువును దెలిసికొనుచున్నది.

ప్రశ్నలు.

౧ కార్యముండగనే యేదియుండవలయును? ఏది లేనియెడల గార్యముగాదు?

౨ ఏదయిన కార్యమునుజూచినపుడు కర్తకనుపడనిచో

ఏకార్యమునకుఁ గర్త లేఁడనియే భావించెదవా? ఉపమానములఁ జూపుము.

౩ జగత్తునందు జరుగు కార్యములలో పది యుపమానములఁ జూపింపుము.

౪ అచేతన వస్తువులు తమంతటఁ దాముగనే పనులను చేయునా? ఇది భావ్యమేనా?

౫ కర్తకు జ్ఞానముగలదని యెటులు గ్రహింపనగును?

౬ నీకు జ్ఞానముగలదని నీవెటులు గ్రహించుచున్నావు?

౭ తలిదండ్రులు మొదలగు వారలకు జ్ఞానము గలదని యెట్లు గ్రహించుచున్నావు?

౮ "కార్యముల మూలమునఁ గర్తజ్ఞానమును దెలిసికొనవచ్చును" దీని నయిదుపమానముల బుజువుపఱుపుము.

౯ మనశరీరమునందు జరుగు నయిదు కార్యముల పేరులను జెప్పుము. దేనివలన నీశ్వరుని జ్ఞానము నభిప్రాయము ప్రకాశమానము లగుచున్నవి?

౧౦ శరీరమునకు వెలుపల జరుగు పదికార్యముల పేరులను జెప్పుము. దేనివలన నీశ్వరుని జ్ఞానము నభిప్రాయము ప్రకాశమాన మగుచున్నది?



## చతుర్థపాఠము. ఈశ్వరుఁడొకఁడు.

---

గాలి మన వెలుపలనుండువస్తువు. ఇది లేనియెడల నొక ముహూర్తమయినను జీవింపఁజాలము. క్రమక్రమముగ మనము గాలిని పీల్చుచుందుము. ఈ పీల్చినగాలి మన ప్రాణరక్షణమును చేయుటయేకాక, శరీరమునందలి మలిన పదార్థములను దీసికొని క్రమక్రమముగ బయటకు వచ్చుచుండును. మన శరీరమునకును, గాలికిని నెట్టి నికటసంబంధము గలదో చూడుము. ఇందువలన మన శరీరరక్షణార్థముగాలి సృష్టింపఁబడినదని మనము బాగుగ గ్రహించియున్నాము. శరీరము గాలి భిన్న వస్తువులను మాట సత్యమే యయినను నొకే యభిప్రాయమునకే యీరెండు వస్తువులును జతకూర్పఁబడియున్నవి. ఏవఁడు శరీరమును సృష్టించియున్నాఁడో, యతఁడే శరీరమున కుపయోగమగునట్లు గాలినిగూడ సృష్టించి యున్నాఁడు. మన శరీరమెక్కడ? నదులు, చెఱువులు, మేఘములు, మొదలగునవియెక్కడ? జలములు లేనియెడల మన ప్రాణములు నిలువఁజాలవు. జలమునకు శరీరము దూరమందున్నది. శరీరమునకు జలము దూరమందున్నది. జలము లేనియెడల జీవించుటకు వీలులేనట్లులు శరీరము నిర్మింపఁబడినది. దాహమును దీర్చుచు, శైత్యము నొసంగుచు ప్రాణములను రక్షించునను నభిప్రాయమున జలములు నిర్మింపబడినవి. శరీరమును జలమును నొకదాని నొకటి దూరమందున్న వనుమాట సత్యమేకాని యొక సూత్రమునకే యీ రెండువస్తువులును నెట్లు బంధింపఁబడియున్నవో చూడుము. జలము శరీరముకొఱకు సృష్టింపఁబడినది. శరీరమెల్లపుడు జలమును గోరుచుం

డును. ఒక యభిప్రాయముననే యొక కర్తయొక్క యిచ్ఛచేత నే యీ రెండువస్తువులకును జతగలుపఁబడియున్నది. మఱియు ను ఫలసస్యములసంగతి భావింపుము. ఇచ్చటనున్న శరీరమున కును భూములయందు ఫలించుధాన్యములకును, ఫలవృక్షముల ఫలించు పండ్లకును నెట్టి నికటసంబంధము గలదో చూడుము. భోజనము భుజింపనిచో నాఁకలివలనఁ దల్లడిల్లుటయే కాక మన ము చనిపోవుదుము. పొలములఁ బండుధాన్యములు వృక్షముల బండుఫలములు మనయాఁకలిని నివారించుచున్నవి. భుజించు పదార్థముల సారము రక్తమాంసములుగ మారి శరీరమునకు బలమును గలిగించుచున్నది. ఇది యెటువంటి యాశ్చర్యకర మగు సంబంధమో చూడుము. ఎవఁడు శరీరమును సృష్టించి యున్నాఁడో యతఁడే శరీర రక్షణార్థము ఫలధాన్యములను ఫ లింపఁజేయుచున్నాఁడు. మఱియును భుజించిన పదార్థములు పక్వమగునటులుచేసి శరీరరక్షణముచేయుచున్నాఁడు. సూర్యు నకును భూమికి నెంతదూరమో గమనింపుఁడు! సూర్యుఁడు మనకుఁ దొమ్మిదికోట్ల క్రోసులదూరముకంటె నెక్కుడు దూర మందున్నటులు తెలుచున్నది. ఇంత దూరమందున్న సూర్యుని వెలుతురును వేడిమియును లేనియెడల నొక్క నిముసమైనను మనపని సాగదుగదా! సూర్యుని వెలుతురులేని యెడల వెంట నే సమస్తప్రాణులు నశించును. సమస్త వస్తువులు నొక యా కారమునే పొందును. సూర్యుఁడు భూమిని నాకర్షించుచున్నా డు. భూమియును సూర్యుని నాకర్షించుచున్నది. ఈ యాకర్ష ణమువలననే సూర్యుఁడును భూమియును దమ తమ స్థానములఁ దప్పకుండనున్నవి. పృథివియొక్క దైనికగతివలన రాత్రిం బవ

ళ్లను, పృథివియొక్క వార్షికగతివలన ఋతుపరివర్తనములును గలుగచున్నవని తెలిసికొనుఁడు. అనేకకోట్ల మైళ్లదూరమందున్న సూర్యునకును భూమికి నెట్టి నికటసంబంధముగలదో చూడుఁడు! వీనిని యేశక్తి బంధించుచున్నది? ఈసంబంధమువలనఁ బృథివిని సూర్యుని, సృష్టించిన వాఁడొకఁడనియు నతఁడే సూర్యునకును భూమికిని గలసంబంధములకుఁ బ్రాపగుచున్నాఁడనియును దెలిసికొనుచున్నాము. వెలుతురు వేఁడిమి యాకర్షణము నలుప్రక్కలఁ దిరుగుట మొదలుగాఁగల బాహ్యసంబంధములను జూచి సృష్టికర్తయొక్క యభిప్రాయముల నిచ్ఛలను మనము గ్రహించుచున్నాము. "సూర్యునియొక్క వెలుతురు వలనను వేఁడిమిని నాకర్షణమువలన భూమి రక్షణమును బొందుఁగాక" అనునదియే యాయన యిచ్ఛయైయున్నది. ఈయొక యిచ్ఛలో సూర్యుఁడు భూమియు నిమిడియున్నవి. కొన్ని కొన్ని కార్యములను భావించినచోఁ బ్రపంచమున నీకార్యములు వేఱువేఱుకర్తల కార్యములని తోఁచవచ్చును. కాని యీ తోఁచుటసత్యముగాదు. బ్రతికించుట చంపుట యను నీరెండు కార్యములకును విస్తారము భేదముగలదు. ఇందువలన బ్రతికించువాఁడొకఁడనియును జంపువాఁడొకఁడనియును దలంపవచ్చును. కాని యిది సత్యముగాదు. మన మాహారమును దిని బ్రతుకుచున్నాము. ఆహారమును మిక్కుటముగఁ దినిన యెడల రోగము గలుగును. రోగమువలన మరణము గలుగవచ్చును. తీపిపదార్థములు తినుటకు బాగుగనుండును. కనుక మితముగఁ దీపిపదార్థములను దినిన యెడల శరీరమునకు నుపకారము గలుగును. కాని మితము తప్పి తినినయెడల రోగమును

మరణమును గలుగును. స్నానము శరీరమునకు నారోగ్యమును గలిగించును. కాని మితిమీఱి స్నానముచేసినచో, జ్వరమును, దగ్గును, గలిగి మరణము సంభవించును. కనుక నొక వస్తువు నందే శరీరమును రక్షించుగుణమును నాశనముచేయు గుణమును నిమిడియున్నవి. ఒకవస్తువునే నియమితముగ వాడుకొనిన నుపకారమును, నియమముదప్పి వాడుకొనినచో నపకారమును, గలుగును. ఇందువలన నొక యీశ్వరుఁడు బ్రతికించి రక్షించుచున్నాఁడనియును నింకొక యీశ్వరుఁడు రోగములు గలిగించి చంపుచున్నాఁడనియును భావించుట కేవిధమగు కారణముగా న్పడదుగదా? ఏవస్తువు తనంతటఁ దానుగఁ బనిచేయదనియును నీశ్వరుఁడు సమస్తవస్తువులను నడిపించుచున్నాఁడనియును మీఁదివఱకే గ్రహించియున్నారు. ఒక వస్తువును మితముగ వాడుకొనినయెడల శరీరరక్షణమును, మితము దప్పివాడుకొనిన యెడల రోగమును మృత్యువును గలుగుననియును దెలిసికొని యున్నాము. ఇందువలన నాయన మనలను బ్రతికించుచున్నాఁడనియును, అనియమముగఁ బ్రవర్తించినచో నాయనయే రోగమును మృత్యువును గలిగించుచున్నాఁడనియును దెలిసికొనవలయును. నిప్పువలనమన మెట్టియుపకారమును బొందుచున్నారమోచూడుఁడు. నిప్పునందుఁదగులఁబెట్టు గుణముగలదు. నిప్పునందుఁ దగులఁబెట్టు గుణముండుటవలననే భోజనపదార్థములను పచనము చేసికొనుచున్నాము. కాని కొంచెమజాగ్రత్తగ నుండినచో నీతగులఁబెట్టుశక్తి వలననే మన శరీరమంతయును దగులఁబడిపోవును. కాన నీశ్వరు లిద్దఱని, లేక, దేవతలిద్దఱని తలంచుటవలనఁ బ్రయోజనము లేదుగదా! ఎందువలన ననఁగా,

నెవఁడు నిప్పుతోడఁ గార్యములను జేయుచున్నాఁడో యాతఁడే భోజనపదార్థముల నుడుకునట్లు చేయుచున్నాఁడు. అజాగ్రత్తగనుండినచో మన శరీరమును గృహమును గ్రామమును బట్టనములను గూడఁ దగులఁబెట్టుచున్నాఁడు. "నిప్పు వేసినఁదగులఁబడును" అను నియమము నెప్పుడును నాయన భంగపఱుపఁడు.

ఇంకను జూడుము! బద్ధకము నొందినావనుకొనుము. అందువలన నెక్కువ నిదురను బోయియుందువు. కనుక నీకు వ్రాఁత చదువులయందు మనసు పోదుగదా! ఇందువలన మనసు చెడుటయే కాక శరీరముకూడఁ జెడును. ఉదయమునను నిదుర లేచుటకు బద్ధగించినావనుకొనుము. ఈబద్ధకించుటయే మనోదోషము. ఈ మనోదోషమునకే నీవు లోఁబడినయెడల బగ లెనిమిది గంటలకు నిదుర లేచెదవు. ఎనిమిది గంటలకు నిదుర లేచుటవలన మనోమాంద్యము గలుగును. మఱియును, ప్రాతఃకాలమందలి నిర్మలవాయు సేవనము లేనందువలనను, బయలునఁ గొంచెము దూరమయినను నడువనందువలనను నీ శరీర మనారోగ్యమును బొందును. ఇందువలనఁ జదువుకొనుటకుఁ గాలము చాలక చదువు వెనుకఁబడును. తిన్నగాఁ జదువనిచో దల్లి, తండ్రియు, నుపాధ్యాయుఁడు మొదలగువారు తిరస్కరింతురు. తోడి విద్యార్థులలోఁ దలవంపులగును. కనుక యోచించి చూచినయెడల మనలోపలకును మన వెలుపలికి నెట్టి సంబంధము గలదో తెలిసికొనఁ గలుగుదువు. మనస్సు నందొక పాపమును వృద్ధిబొందించుకొనుటవలనఁ బయటను గూడ నెంతకష్టమును బొందుచున్నావో చూడుము. ఎవఁడు వివేకము వలన

మనలను శాసించుచున్నాఁడో యాయనయే బయటి కార్య ములనుగూడఁ జేయుచున్నాఁడని ద్వితీయపాఠమునఁ జదివిన వాక్యములను మఱింత స్పష్టముగఁ దెలిసికొనుటకుఁ బ్రాయ త్నింపుఁడు. మనస్సునందలి యాయన యిచ్చనువినిన మొదల నాయన మనకులోపలను వెలుపలను దగు ఫలమును గలిగిం చును. మనస్సునందు లోభమునకు స్థానమిచ్చినను కోపమును వృద్ధిఁబొందించుకొనినను, నసత్యమును బలుకవలయునను కోరిక గలిగిన కొలఁది నసత్యమాడినను జనువుట కశ్రద్ధచేసిన నేమ గునో భావించిచూడుము. ఎవఁడు పాపకార్యములు చేయఁ గూడదని మనస్సునందు నిషేధించియున్నాఁడో యెవఁడు పుణ్య కార్యములు చేయ నాజ్ఞాపించియున్నాఁడో యాతఁడే పాప పుణ్యములకుఁ దగుఫలములను బయటనే యిచ్చుచున్నాఁడని యును విస్పష్టముగఁ దెలిసికొనుఁడు.

దూరముననుు, సమీపముననుు, లోపలను వెలుపలను నీశ్వరుఁడొకఁడే కార్యములను జేయుచున్నాఁడని యోజించి చూచినకొలఁదిని స్పష్టముగఁ దెలిసికొనుచుందుము. సూర్యుఁ డు,చంద్రుఁడు, పృథివి, మేఘములు, వాయువు, అగ్ని,జలము, వృక్షములు, లతలు, ప్రాణులు, ధనము, విద్య, సుఖము, దుఃఖము, జీవితము, మరణము, మొదలగువ వన్నియును బర మేశ్వరుని యధీనములు. ఆయన యొకఁడే జగత్తునకు రాజు, శేక, కర్తయయియున్నాఁడు.

ప్రశ్నలు.

౧ శరీరమునకును వాయువునకునుగల సంబంధమెట్టిది? ఈ సంబంధమువలన మనమేమి తెలిసికొనుచున్నాము?

౨ మనశరీరమును పొలముల యందలి సస్యములును నొక్కనియొక్క కార్యము లేయని గ్రహింపనగు విధమెద్ది?

౩ సూర్యునకును భూమికిని సృష్టికర్త యొకఁడని గ్రహించుటెట్లు?

౪ ఈశ్వరుఁడు జన్మమరణములకుఁ గర్తయని తెలిసికొను విధమెద్ది?

౫ ఎవఁడు మనమనస్సునందుఁ బాపములు చేయఁగూడదని నిషేధించి యున్నాఁడో యతఁడే పాపకార్యములకు మన వెలుపలనే దండనను విధించుచున్నాఁడను దానిని సయి దుపమానముల వలన ఋజువుపఱుపుము.

౬ ఎవఁడు పుణ్యకార్యములు చేయ నాజ్ఞాపించి యున్నాఁడో యతఁడే పుణ్యకార్యములకుఁ బ్రతిఫలము నిచ్చునను నంశము సయి దుపమానముల వలన బోధపఱుపుము.

## పంచమ పాఠము— ఈశ్వరుఁడు నిరాకారుఁడు

నీవీపుస్తకమును జూచుచున్నావు. కనుకనీవు చూచువాఁడవును (ద్రష్టవు) పుస్తకము చూడఁదగినది, (దృశ్యము) నగుచున్నది. ఇందువలన నీవు పుస్తకముగావు. పుస్తకము నీవును గాదు. అనిస్పష్టముగఁ దెలిసికొనుము. నీవు నీయొక్క కాలు ముక్కు ముఖమును జూచుచున్నావు. ముట్టుకొనుచున్నావు. కనుక నీవు జ్ఞాతవు. వస్తుసముదాయము జ్ఞేయము. ఇందువలనఁ గాలు ముక్కు ముఖమును నీవుగావనియును నీవు కాలు ము

క్కు ముఖమును గావనియును దెలిసికొనుము. నీశరీరమును నీవు దెలిసికొనుచున్నావు. గాని నీ శరీరము నీవుగాదు. నలుదిశల యందలి వస్తువులను నీ శరీరము నెవఁడు చూచుచున్నాఁడో వాఁడేనీవు. ఏవస్తువులను నీవుదెలిసికొనుచున్నావో యవి నీవు గావు. ఏది దెలిసికొనుచున్నదో యదినీవు. తెలిసికొనుటకు నీకు ముక్కు ముఖము కన్నులు మొదలగునవి యంత్రముల వంటివి. ఎవఁడు వినుచున్నాడో యెవఁడు చూచుచున్నాడో యెవఁడు ముట్టుకొనుచున్నాఁడో యెవఁడాస్వాదనము చేయుచున్నాఁడో యెవఁడు పీల్చుచున్నాఁడో వానిని జూడఁజాలము. ముట్టుకొనఁ జాలము.

నీవు, పొడుగు, వెడల్పు, మందము, పెద్ద, చిన్న, వస్తువులను జూచుచున్నావు. కాని, శరీరములోపల నుండు నీవు పలువిధము లగు నాకారములు గల వస్తువులను చూచుచున్నను శరీరములోపల నుండు నీవు పొడుగునుగావు. పొట్టిదియునుగావు. ఏవస్తువున కాకారము లేదో యావస్తువును నిరాకారమందురు. చూచుదానిని, వినుదానిని, గ్రహించుదానిని నాత్మయని చెప్పుచున్నాము. "ఆత్మ" యనగా "నేను" నని యర్థము. అందువలన "నాయాత్మ" యనువాక్యము భ్రమతోఁ గూడుకొన్నది. ఎందువలన ననగా, "నాయాత్మ" యనగా "నాయొక్క నే"ని యర్థమగును. అందువలన నాయాత్మయని చెప్పినచో నసంగతశబ్దమును జెప్పినవారమగుదుము. సకల జీవుల శరీరములయందున్న యాత్మవస్తు వెట్టిదియో భావించిచూడుడు. ఏది చూచుచున్నదో వినుచున్నదో గ్రహించుచున్నదో పనిచేయుచున్నదో శరీరమును నడపించుచున్నదో దానినే మన

మాత్మయని చెప్పుచున్నాము. ఆత్మ యచేతన వస్తువులవలెఁ బొడుగుగాదు. పొట్టియునుగాదు. పెద్దదిగాదు. చిన్నదియును గాదు. ఎఱ్ఱనిదిగాదు. నల్లనిదియునుగాదు. అనఁగా నీవస్తువునకు నాకారము లేదనియును "నిరాకారము" అనియునుఁ జెప్పనఁ జాలును. కాని కన్నులతోడఁ జూచుటకును చెవులద్వారమున వినుటకును, నేయింద్రియము ద్వారముననయినను దెలిసికొనుటకు వీలుగాని "ఆత్మ"ను మనము స్పష్టముగఁ దెలిసికొనఁ గలుగుచున్నాము. దీనిని జూడలేనిమాట సత్యమేకాని యిది చూచుచున్నది. ఇదియే చూచుట యనుక్రియకుఁ గర్తయైయున్నది. దీనిని వినలేనిమాట సత్యమే కాని యిది వినుచున్నది. ఇందువలన నిదివినుట యనుక్రియకుఁ గర్తయై యున్నది. ఇది కాళ్లు చేతులువలె నడచుట కదలుట లేనిగాని, యిదియే కాళ్లు చేతులను నడిపించుచున్నది, కదలించుచున్నది. ఇదియే సర్వకార్యములకుఁ గర్తయైయున్నది. ఇందువలన నాత్మను జూడఁజాలము. వినఁజాలము, పట్టుకొనఁజాలమను మాట వాస్తవమే కాని యాత్మచూచునప్పుడు వినునప్పుడు పట్టుకొనునప్పుడు తన్నుఁదానే తెలిసికొనుచున్నది. ఆత్మ నింద్రియముల ద్వారమునఁ దెలిసికొనఁజాలని మాట వాస్తవమే కాని, ప్రజ్ఞద్వారమునఁ గాని, యాంతరదృష్టి వలనఁగాని, దెలిసికొనఁ గలుగుదుము. అనఁగా నాత్మతన ప్రజ్ఞద్వారమునఁ దన్నుఁ దెలిసికొనుచున్నది. తాను జ్ఞాతయనియును గర్తయనియును దెలిసికొనుచున్నది.

ఈశ్వరుఁడెటువంటి యాత్మయో దానిని మనము సహజముగ గ్రహింపఁగలుగుదుము. ఆయన మనలనెప్పుడు దెలిసికొనుచున్నాఁడో ప్రపంచములోని వస్తువములదాఁకను నెప్పుడు

దెలిసికొనుచున్నాఁడో యెవ్వఁడు జగత్సముదాయమును సృష్టించి నడిపించుచున్నాఁడో యెవ్వఁడు జ్ఞాతయును గర్తయునగుచున్నాఁడో యవ్వఁడే యాయన యాత్మయని చెప్పుట కణుమాత్రమైనను సందియము లేదుగదా? ఎప్పుడాయాత్మ నిరాకారమో యప్పుడీశ్వరుఁడును నిరాకారుఁడని తెలిసికొనుచున్నాము. ఈశ్వరుఁడు చెట్టుపుట్ట శరీరములవంటి వాఁడుగాఁడు. రాయి లేక మట్టిబొమ్మలవంటి వాఁడునుగాఁడు. ఆకాశమువలె శూన్యుఁడునుగాఁడు. ఆయన జ్ఞానవంతుఁడును దయావంతుఁడును బవిత్రుఁడును గర్మశీలుఁడును నగు నాత్మ. ఆయనయన్నిటికంటె శ్రేష్ఠుఁడు. ఆయనకు సమస్తము దెలియును. మఱియు నాయన జగత్తునకుఁ గర్త. ఇందువలననే యాయనను "పరమాత్మ"యని చెప్పెదము. లేక శ్రేష్ఠాత్మయని చెప్పినను జాలును. జ్ఞానమును బలము నల్పముగఁ గలిగిన నీవు నేను వాఁడు మొదలుగాఁగల యాత్మలను జీవాత్మలని చెప్పెదరు. జీవాత్మయును బరమాత్మయును నిరాకారమనుమాట సత్యమేకాని యొకవిషయమున మాత్రము రెంటికిని కొంచెము భేదముగలదు. మనమీ భేదమును దెలిసికొనుట యావశ్యకము. ఏ మనుజుని పేరు చెప్పినను వెంటనే యామనుజుని శరీరమును భావించుటయేకాక, శరీరమును భావించుటతోఁగూడ శరీరాంతర్గతమైన యాత్మనుగూడ భావించుచుందుము. ఇందువలన వాని శరీరమాత్మగాదనుట స్పష్టమేకదా? ఎందువలన ననఁగాఁ జూచుట వినుట గ్రహించుట పనులుచేయుట మొదలగు కార్యములను శరీరము చేయఁజాలదు. ఆత్మయే యీ కార్యములన్నిటిని చేయును. కనుక జీవాత్మ వినుటయును జూచుటయును గ్రహించుటయును

గార్యములఁ జేయుటకును శరీరమును యొక్క సహాయమును బొందుచున్నది. కన్నులు చూడలేవు. గాని, కన్నులద్వారమున జీవాత్మ చూచుచున్నదనుట నిస్సంశయము. మరణించినప్పుడు జీవాత్మ శరీరము వదలును. అప్పుడు కన్నులు కొంచెమైనను జూడఁజాలవు గదా? చెవులు వినఁజాలవు గదా? ఇందువలన జూచుట, వినుట, ముట్టుకొనుట, పనిచేయుట, కన్నులయుఁ జెవులయుఁ జేతులయుఁ గార్యములు గావనియు నాత్మచేయుచున్న కార్యములనియును స్పష్టపడుచున్నది. ఆత్మ శరీరమునం దెంత కాలముండునో యంతకాలమును గన్నులద్వారమునఁ జూచును. చెవుల ద్వారమున వినును. చేతులద్వారమున స్పృశించును, పని చేయుచుండును. అనగా జీవాత్మ శరీరము ద్వారమున యనేక కార్యములను చేయుచున్నదని చెప్పఁజాలును.

జీవాత్మకు శరీరము లేనిమాట సత్యమే కాని యొక్కొక్క జీవాత్మ యొక్కొక్క శరీరముద్వారమున నెప్పుడు పనిచేయుచున్నదో యప్పుడు మనుష్యుని యొక యర్థమున సాకారుఁడని చెప్పవచ్చును. సాకారమగు శరీరము నాశ్రయింపక నిరాకారజీవాత్మనేక కార్యములను జేయఁజాలదు.

కాని యీశ్వరుని సాకారుఁడని చెప్పుటకు వీలులేదు. ఎందువలన ననఁగా, నాయన చూచుచున్నాఁడుగాని, యాయనకుఁ గన్నులు లేవు; కన్నులు లేకుండఁగనే యాయన చూడఁగలఁడు. ఆయన వినుచున్నాఁడుగాని యాయనకుఁ జెవులు లేవు. చెవులు లేకుండఁగనే యాయన వినఁగలఁడు. ఆయన మనలోపలను వెలుపలను గార్యములను జేయుచున్నాఁడు. కాని యాయనకుఁ జేతులు లేవు? యాయన చేతులు లేకుండఁగనే సమస్తకా

ర్యములను జేయఁగలఁడు. ఆయనకు శరీరమే యున్నపక్షమున దప్పక దానిని మనము చూడఁగలిగియే యుందుము. ఎప్పుడు మనమాయన శరీరమును జూచుటకు వీలు లేదో యప్పుడాయనకు శరీరము లేదనుట స్పష్టము. ఆయన మన మనస్సులోని మాటలను గ్రహించుచున్నాఁడనియును రక్తము మాంసము జీర్ణయంత్రము మొదలగు మనలోని యంగములను గూడఁ జూచుచున్నాఁడనియును మీరు ప్రథమ ద్వితీయ పాఠములయందుఁ జదివియున్నారు. ఈసమస్త వస్తువులను జూచుటకు నాయనకుఁ గన్నులే యావశ్యకమయిన యెడల నప్పుడీ సమస్తవస్తువుల వెంట నాయనకన్నులు కనుపడవలయును. ఎప్పుడాయన కన్నులను మనము చూచుటలేదో యప్పు డాయనకుఁ గన్నులు లేవనియును నాయనకుఁ గన్నులయొక్క ప్రయోజనము లేదనియును జెప్పుటకు నిస్సంశయము. ఆయన గాలిని వీచునటులు చేయుచున్నాఁడు. అగ్నిని మండునటులు చేయుచున్నాఁడు. ఈ కార్యములు చేయుటకాయనకుఁ జేతులావశ్యకమయినచో నీవస్తువుల వెనువెంట నాయనచేతులును గనుపడుచుండెడివి. కాన నాయనచేతుల నెప్పుడు చూచుటలేదో యప్పుడు డాయనకుఁ జేతులు లేవనియును నాయనకుఁ జేతులవలనఁ బ్రయోజనము లేదనియును, జేతులు లేకుండఁగనే యీ సకల కార్యములను జేయఁగలిగి యున్నాఁడనియును దెలిసికొనుచున్నాము.

ఆయన కొకశరీరముగలదనియు నాశరీరమును మనము చూడలేమనియు నెవరయినను జెప్పవచ్చును. శరీరమున్నచో నాశరీరమునకు వెడల్పు పొడవు పొట్టి మొదలగు పరిమాణము

లును, హద్దునుండవలయును. నీ శరీరము నీ యింటియందున్న ప్పుడు పాతశాలయందుండదుగదా. ఇందువలన నీశ్వరుడు భూమియందున్నప్పుడు సూర్యునియందు లేడనియును, సూర్యునియందున్నప్పుడు భూమియందు లేడనియును, చెప్పవలసి వచ్చును. ఈశ్వరున కొక శరీరముగలదని భావించినచో యీశ్వరుడొక పరిమితవస్తువయగును. మనకంటె చాలపెద్దవస్తువ యనుమాటయేకాని, యనంతుడుగాక పోవును. బాగుగ విచారించి చూచినచో మనలోనున్న, నీశ్వరుని భావమనంత భావమని స్పష్టముగ దెలియును. ఎవడనంతుడో వానికి నాకారము సంభవింపదు.

మనము మనుష్యుని భావించుటకు మొదలిడి వాని శరీరమును భావింతుము. ఈశ్వరుని భావించుటకు మొదలిడి నప్పుడే శరీరమును భావించుట యుచితముగాదు. ఎందువలన ననగా, నాయనకు శరీరములేదు. కాని యాయనను భావించుటకు మొదలిడి మనము సమస్త ప్రపంచమును భావింతుము. ఏల యన నీ సమస్త ప్రపంచమునందును నాయన కార్యములను జేయుచున్నాడుగదా. ఆయన విషయములను భావించుటకు మొదలిడి మన రక్తప్రవాహవిషయమును భావింపవలయును; మన శరీరముయొక్క రక్షణవిషయమును భావింపవలయును; మన శరీరాభివృద్ధి విషయమును భావింపవలయును; సూర్యుని విషయమును భావింపవలయును మేఘముల విషయమును భావింపవలయును; గాలి విషయమును భావింపవలయును. ఏల యన నీశ్వరుడీ సముదాయ కార్యములలోఁ బనిచేయుచున్నాడు. కాని యీ సకలవస్తువుల సహాయమునొందక యీశ్వరు

ము పనిచేయఁజాలఁడని భావింపఁగూడదు. ఆయన నిరాకారాత్మ యనియును సమస్త వస్తువులయం దున్నాఁడనియును సమస్తమును దెలిసికొను చున్నాఁడనియును సమస్తమును నడిపించు చున్నాడనియును దెలిసికొనవలయును.

## ప్రశ్నలు.

౧. శరీరమునకు నాత్మకును గలభేదమును దెలిసికొను విధ మెద్ది?

౨. సాకార మన నేమి? నిరాకార మన నేమి?

3. ఆత్మ యని దేనినందురు?

౪. ఆత్మ కనుఁబడఁజాలనప్పు డాత్మగలదని తెలిసికొనువిధ మెద్ది?

౫. ఈశ్వరుఁడు నిరాకారుఁడని తెలిసికొనువిధ మెద్ది?

౬. ఈశ్వరుని పరమాత్మయని యేల పిలువవలయును?

౭. జీవాత్మ యనఁగా నర్థమేమి?

౮. మనుష్యుని నేయర్థమున సాకారుఁడని చెప్పనగును?

౯. ఆయర్థమున నీశ్వరుని సాకారుఁడని చెప్పవచ్చునా? చెప్పకూడదా?

౧౦. ఈశ్వరుఁడు సాకారుఁడు గాఁడని బోధపఱచుము.

## షష్ఠపాఠము. ఈశ్వరుఁడు దయామయుఁడు.

మీరు ప్రథమపాఠమునం దీశ్వరుని దయాసంబంధమున జదివియున్న దానిని జ్ఞప్తికిఁ దెచ్చికొనుఁడు. ఈశ్వరుని దయామయుఁడని యెట్లు తెలిసికొనఁ గలుగుదుము? ఆయన మనుష్యులను ప్రేమించునా? ఈశ్వరుఁడు మన కొసఁగిన వివేకము మూలమున "మనుష్యులను బ్రేమించుట యుచితము" అని తెలియఁ జేయుచున్నాఁడు. ఆయన మన మనస్సునందు సర్వదా దయమీఁద శ్రద్ధను నిర్దయమీఁద నశ్రద్ధను గలిగించుచున్నాఁడు. తలిదండ్రులు మనలను బ్రేమింతురు. అందువలన దల్లిదండ్రులమీఁద మనకు శ్రద్ధయుండును. వారు చాల మంచి కార్యములను జేయుచున్నారని మనకు వివేకము చెప్పును. ఎవఁడు సర్వదా యితరులమీఁదఁ గోపమును గలిగియుండునో, ఇతరులను దిట్టుచుండునో యితరుల కపకారము చేయుచుండునో వానిమీఁద మన మశ్రద్ధను జూపుదుము. వివేక మీ మనుష్యుఁడు గొప్ప యన్యాయకార్యమును జేసినాఁడని చెప్పును. బీదవాండ్రకును బిచ్చగాండ్రకును దయతో నిచ్చువానిని మంచివాఁడని చెప్పుదుము. బీదవాండ్రను, బిచ్చగాండ్రను నిర్దయతో వెళ్ళఁగొట్టువానిని దుష్టులని చెప్పుదుము. మనము తలిదండ్రులను బ్రేమతోఁ జూచుచు, వారితో మృదుమధుర వాక్యములఁ బల్కుచు, సంతోషముతోడ వారి వాక్యములను వినుచు రోగసమయములందు వారికి సేవాకృతజ్ఞతలను జూపుచుండినచో వివేకము బాగు, బాగని చెప్పును. ఇదేవిధముగఁ దమ్ములను జెలియండ్రి నాదరముతోడఁ జూచుచు, భోజనముఁ

పెట్టి స్నానము చేయించి, పూలనిచ్చి, పాఠములు చెప్పుచుండు నప్పుడు, దయతోఁగూడిన నీకార్యములు, బాగున్నవి బాగున్న వని వివేకము నుడువును.

అప్పుడప్పుడు మనమనస్సు చెడుచుండును. అట్టిసమయమునఁ దలిదండ్రులతోఁ గోపమున మాట్లాడుదుము. వారి మాటలను వినము. వారికి శుశ్రూషలు చేయక యామోదములగు విషయములయందు, లేక యాటలయందు బ్రవేశింతుము. ఇంతియకాక, తమ్ములతోడను చెలియండ్రతోడను గఠినముగ మాట్లాడుదుము. వారి విషయమునఁ దగినంతశ్రద్ధను దీసికొనక వంకలు పెట్టుదుము. వారిభోజనము, చదువు, దేహపరిశ్రమ మొదలగువానియందు మనస్సుంచక యామోదప్రమోదములయందు మునిఁగి సంతుష్టిని బొందుచుందుము. కాని యప్పుడప్పుడు మన మీవిధమగు కార్యములను జెడుకార్యము అని స్పష్టముగఁ దెలిసికొనఁజాలకపోయినను గొన్ని నిముసముల తర్వాతనయిన నీ కార్యములు చెడుకార్యములని వివేకము మనకు స్పష్టముగఁ జెప్పును. అప్పుడు మన మీవిధమగు నిర్దయకార్యముల నేలచేసితిమని విచారింతుము, మఱియును నిర్దయకార్యములపై నేవగలుగును. ఇందువలనఁ బరమేశ్వరుఁడు "దయ యుత్కృష్టవస్తువు, నిర్దయ హేయమగువస్తువు" అని వివేకము వలన మనకుఁ దెలియఁ జేయుచున్నాఁడు.

వివేకము ఈశ్వరుని యొక్క శక్తి. అందువలన డెట్టివాఁడో యాయన స్వభావమెవిధముగ నుండునో మనము తెలిసికొందుము. ఆయన మొదట వివేకమువలన మనకు, దయ శ్రేష్ఠమగు వస్తువు నిర్దయ హేయమగువస్తు వని స్పష్టము

గఁదెలియఁ జేయుచున్నాఁడో యప్పుడాయన దయామయుఁ డ నుటకు నిస్సంశయము. ఆయన నిర్దయను హేయముగఁజూచు నని మనము బాగుగ గ్రహించితిమి. దయమీఁద శ్రద్ధను నిర్దయమీఁద నశ్రద్ధను గలుగఁ జేయుచున్నవాఁడు నిశ్చయ ముగ దయామయుఁడు. ఎవఁడయిన మనలను నిందించినగాని మనవస్తువులలో దేనినయినను దొంగిలించినఁగాని, మన యా మోదమునకు భంగము గలిగించినఁగాని, వానిమీఁద మన కప్పుడప్పుడు విస్తారము కోపము వచ్చుచుండును. కాని మనము వాని పనినిమాత్రమే యసహ్యించుకొనుట యుచితముగాని యామనుష్యుని గూడ నసహ్యించుకొనుట యుచితముగాదు. వాఁడును మనవంటి మనుష్యుఁడనియును, ఈశ్వరుని సంతాన మనియును, మనసోదరుఁ డనుసంగతిని మనము మఱచి పోవుచుందుము. ఇందువలననే వానికి నయిష్టముగలుగు కార్య ములను యోజనలను జేయుచుందుము. మన జ్ఞానము మనోబల మల్పమయిన కారణముననే యీవిధముగఁ జేయుచుందుము. కాని యీశ్వరుఁడు సమస్తమును దెలిసికొనును. ఆయనకొంచె మైనను భ్రమపడఁడు. ఆయనబలమునకుఁ గొంచెమైనను లోటు లేదు. అందువలన నాయన మనమువలెఁ గోపమును గలిగి యుంట యసంభవము. ఆయన కేమియును నభావములేదు. మనమువలె నాయన యామోద ప్రమోదముల కొఱకు నాతు రుఁడై యుండఁడు. ఆయనకెవరు నష్టమును గలిగింపఁజాలరు. తన యిచ్ఛానుసారము మనుష్యుఁడు ప్రవర్తింపనిచో దనయిచ్ఛా నుసారము ప్రవర్తింప వలయునని వివేకమువలన దెలియఁజే యును మనుష్యుఁ డావిధముగఁ బ్రవర్తింపనిచో, నాయనకు

నేవిధమగునష్టమును లేదు. కాని యందువలన మనుష్యునకు మాత్రము నష్టము గలుగును. మనకు నష్టమును గలిగించు వానిమీఁదఁ గోపము చూపువిధమున నీశ్వరుఁడు మనమీఁదఁ గోపమునుజూపఁడు. మనుష్యుఁడు పాపకార్యములను జేసినను మనుష్యుఁడు తన సంతానమును గూడ నెప్పుడును మఱచిపోడు. మనము మనుష్యుల నన్ని సమయములయందును జూచుచుండ లేము. ఏలయనఁగా మనుష్యుఁ డొంటరిగ నుండవచ్చును. ఒక మనుజుఁ డొకస్థలమున, నింకొక మనుజుఁడింకొక స్థలమున నుండవచ్చును. ఇందువలన నొకమనుజుని యింకొక మనుజుఁడు మఱచి పోవచ్చును. కనుక మనుజుఁడు సర్వకాలముల యందును మన మనస్సునందుండఁడు.

కాని యీశ్వరుఁడు సకల శరీరములయందును మనస్సులయందును నున్నాఁడు. మనలను బ్రతికించుచున్నాఁడు. మనలను సర్వదా రక్షించుచున్నాఁడు. ఏపనియందును మనలను మఱచుట లేదు. మనము పాపకార్యములను జేసినను మన మాయన సంతానమునుమాటను మఱచిపోవువాఁడుగాఁడు. ఆయన యెప్పుడును మనకు నష్టమును గలిగించు నాలోచనను జేయఁడు. ఎప్పుడును నష్టమును గలిగింపఁడు. అప్పుడప్పుడు మనము మనుజులమీఁద నిర్దయను జూపించుట నష్టమును గలిగించుట సత్యమేకాని, యిదిమన యజ్ఞానఫలము, దుర్బలతాఫలము. సంపూర్ణజ్ఞానమును, సంపూర్ణ బలమునుగల యీశ్వరుఁడు నిర్దయుఁడగుటకు వీలు లేదు.

ఈశ్వరుఁడు ప్రేమించునని యాయనచేయు కార్యముల వలన మనము స్పష్టముగ గ్రహింపఁగలుగుదుము. (తెలిదండ్రి

లు మనలను ప్రేమించుచున్నారని మన మెటులుగ్రహింపఁగలు గుదుము? తలిదండ్రులు మన కన్నముఁ బెట్టుదురు. వస్త్రము లిత్తురు, బొమ్మలనిత్తురు, పటమ్ము లిత్తురు, పుస్తకము లిత్తురు, మనలఁ జదివింతురు, మనకు జబ్బుగలిగినప్పుడీ జబ్బుకుదురవలయునని, యీశ్వరునియెదుటఁ బ్రార్థనఁ జేయుదురు. మనకు శుశ్రూష జేయుదురు. ఈకార్యములనన్నిటిని జూచి వారుమనలను ప్రేమించుచున్నారని తెలిసికొందుము. వారు మంగళకరమగు పనులుచేయుటవలన మనలను ప్రేమించుచున్నారని స్పష్టముగఁ జెప్పనఁజాలును. ఈశ్వరుఁడు సర్వదా మనకు మంగళమును గలిగించుచున్నాఁడు. మనకీ సంసారమునకేదేని ప్రయోజనమేమో యనఁగాఁ జూచుట వినుట నడచుట పనిచేయుట మొదలగు కార్యములు చేయుటకుఁదగు నట్టి యంత్రములతోడ మనల సృష్టించియున్నాఁడు. అనఁగాఁ గన్నులు, చెవులు, చేతులు, కాళ్లు, మొదలగువానిని నిర్మాణముచేసి మనలను సంసారమునకు రాఁగలందులకుఁగాను దయను చేసియున్నాఁడు. తల్లిగర్భమునందలి జాగ్రత్తగ మనలను గాపాడియున్నాఁడు. పృథివికి రాఁగనే యాహారముగావలయును గనుక మనము రాకమునుపే మన తల్లిస్తనములయందుఁ బాలను బెట్టి యున్నాఁడు. సప్రయత్నముగ మనరక్షణము జరుగుటకు దలిదండ్రులకుఁ బుత్రవాత్సల్యమును గలిగించియున్నాఁడు. మనము పెద్దవారమయినను దలిదండ్రులకు మనపైని స్నేహము తఱుఁగదు. కనుకనే వారెల్లకాలమును మన మంగళములను జింతించుచుందురు.

ఈశ్వరుఁడు ఫలములను, ధాన్యములను, ప్రత్తిని బుట్టునటులచేసి మనుష్యుని హృదయమున, వంట వస్త్రములు, తయారు చేసికొను బుద్ధిని బుట్టించియున్నాఁడు. ఇందువలన, మనము వస్త్రములను నాహారమును బొందుచున్నాము. ఆయన మనశరీరము బలముగ నుండవలయునని మాత్రమే భావింపలేదు. కనుక మనము సుఖమును బొందుటకుఁ దినుపదార్థముల యందెంతో మాధుర్యమును బ్రసాదించియున్నాఁడు. వృక్షములు లతలు నాకాశము పశువులు పక్షులు మొదలగు వాని కెట్టి సుందరవర్ణములను బ్రసాదించియున్నాఁడో చూఁడుము. మనజ్ఞానశిక్షణగాను గురువులకు జ్ఞానశిక్షనిచ్చు శక్తి నిచ్చియున్నాఁడు. చిత్రకారులకుఁ జిత్రములు వ్రాయుశక్తి నిచ్చియున్నాఁడు. మనము ధార్మికులము గావలయునని సర్వదావివేకమువలన ధర్మాధర్మములను బోధించుచుండుటయే కాక ధర్మోపదేశములను జేయుశక్తిని తల్లి తండ్రి గురువు ఉపాధ్యాయుఁడు మొదలగు వారలకుఁ బ్రసాదించియున్నాఁడు. మన మితరులను బ్రేమించుచు నితరుల ప్రేమకుఁ బాత్రులమగుచు సుఖులముగానుండుటకు మనహృదయములు కోమలములగుటకును ప్రేమయుభివృద్ధిపొందుటకును, దల్లి, తండ్రి, యన్న, తమ్ముఁడు, అక్క, చెల్లెలు, బంధువులు, మిత్రులు మొదలగువారిని మనకుఁ బ్రసాదించుటయేకాక దీనులమీఁద దుఃఖులమీఁద దయను మనకుఁ బ్రసాదించియున్నాఁడు. కాఁబట్టి యీశ్వరుని దయావిషయములను బూర్తిగఁ జెప్పుట కెవ్వరితరమగును? విచారించిచూచిన కొలఁదిని నాయన దయకు సీమలేదని తెలిసికొనుచుందుము. మన లోపలను వెలుపల నుండు గణనాతీతవస్తువు లాయన

పరిపూర్ణదయను బ్రకాశము చేయుటలేదా?

సూర్యచంద్రులు, మేఘములు, వర్షములు, వాయువు అగ్ని, భూములు, వృక్షములు, ఇండ్లు, స్వజనము, ఆహారవస్త్రములు, పుస్తకములు, ఉపాధ్యాయులు, ఆచార్యులు, సమాజము రోగములు, ఔషధములు మొదలగు కార్యములను భావించి చూచినచో నీశ్వరుఁడు మనల నెటులు ప్రేమించుచున్నాఁడో తెలిసికొనఁగలుగుటయే కాక సర్వదా మనకు మంగళము నే కూర్చుచున్నాఁడనియుఁ దెలిసికొందుము. ఆయనవలె మనవిషయమున శ్రద్ధపుచ్చుకొను వారెవరును లేరు. పరమాప్తులగు తల్లి తండ్రి బంధువులు స్నేహితులు మొదలగు వారలు కూడ నప్పుడప్పుడు మఱచిపోవచ్చును. మనలను విడిచిపోవచ్చును. రాత్రింబవళ్లు లనుభేదము లేక ముహూర్తకాలమైన నీశ్వరుఁడు మనలను విడిచియుండఁడు. ఆయన సర్వదా వెంటనంటియుండి మనలను రక్షించుచుండును. అందఱిప్రేమకంటె నాయన ప్రేమ మనమీఁద నధికము.

ఎవఁడు మంగళేచ్ఛను గలిగి మంగళకార్యములను చేయుచున్నాఁడో యతఁడు మనలను సర్వదా ప్రేమించుచున్నాఁడనుమాటను సులభముగ గ్రహింపఁగలుగుదుము. కాని యీ వాక్యముతోడ నింకొకవాక్యమును మన మనస్సునం దుంచుకొనుట యావశ్యకము. చేదుమందును దినుట కష్టముగదా. కష్టమైనను దీనిని దినుటవలన మనకు మంగళముగలుగును. ఇందువలన సుఖమాత్రమే మంగళకరముగాదనియు నప్పుడప్పుడు దుఃఖముగూడ మంగళకరమనియుఁ దెలిసికొనవలయును. కేవలము సుఖమును గలిగించుటవలననే ప్రేమ ప్రకాశమగున

నుటకువీలులేదు. అప్పుడప్పుడు దుఃఖమును గలిగించుటవలనను బ్రేమ ప్రకాశమగుచుండును. మనతల్లి మంచిఫలములను మంచి వస్త్రములను మనకిచ్చునప్పు డేవిధముగఁ బ్రేమ ప్రకాశమగు చుండునో యదేవిధముగఁ జేదుమందు లిచ్చినప్పుడును, తప్పు కార్యములుచేసిన దండించునప్పుడును బ్రేమ ప్రకాశమగుచుం డును. కాని యిట్టిసమయములలోఁ దెలివితక్కువబాలుఁడు సందర్భమును గ్రహింపఁజాలక తల్లినిర్దయను జూపించినదని తలం చును. మన మనేక సమయములలోఁ దెలివి తక్కువబాలుఁడు వలె నీశ్వరుని కార్యములను భావించుచుందుము. రోగము, లేక విపత్తును గలిగించినచో మనపై నిర్దయఁజూపించుచున్నాఁ డని తలంతుము. కాని యిట్లుభగవంతునుదలంచుట యుచితముగాదు.

ఎవఁడు నిర్దయ నసహ్యించుకొనుమనటులు మనలను బ్రే రేపించుచున్నాఁడో యతఁ డెప్పుడును నిర్దయుఁడగుటకు వీలు లేదు. నిర్దయయనునది యాయనయం దుండుట యసంభవమని సర్వదా దృష్టిపథముం దుంచుకొనవలయును. ఆయన మనమంగళా ర్థము సుఖదుఃఖములను గలిగించుచుండును. మన క్షేమంగళ మును గూర్చుటకు నేదుఃఖమును బ్రసాదించుచున్నాఁడో మన మన్ని సమయములయందును గ్రహింపఁజాలము. కాని నొక్కొకప్పుడు గ్రహించుచుందుము. మన మప్పుడప్పుడు తలిదండ్రు ల యుద్దేశములనే గ్రహింపఁజాలక పోయినప్పు డీవిశాల విశ్వ మునకుఁ గర్తయగు వాని కార్యముల నభిప్రాయములను దెలిసి కొనఁజాలకుండుటయం దాశ్చర్యమేమున్నది? ఆయన యేకా ర్యము లేయభిప్రాయముతోఁ జేయుచున్నాఁడో దానిని జ్ఞాన ము వృద్ధియైన కొలఁదిని గ్రహింపఁగలుగుదుము. కావున మన

మాయన యభిప్రాయములను గ్రహించువఱకును, మనకు దయమీఁద శ్రద్ధను బుట్టించినాఁ డనియును న్యాయముమీఁద నశ్రద్ధను గలిగించినాఁ డనియును. క్షణ క్షణ మసంఖ్యోపకారములను జేయుచున్నాఁడనియును, దయామయుఁడు ప్రేమామయుఁడు మంగళమయుఁడు ననియును, విశ్వసించియుండుట యుత్తమము.

ప్రశ్నలు.

౧. దయ న్యాయ విషయముల వివేక మేమి చెప్పుచున్నది?

౨. దీని కియ్యుపమానములను జూపింపుము?

౩. ఈశ్వరుఁడు దయాళుఁడని తెలిసికొను విధమెద్ది?

౪. మన మప్పుడప్పుడు మనుష్యులమీఁద దయను జూపుటకుఁ గల కారణమేమి?

౫. ఇందువలన నేమి ప్రకాశమగును?

౬. ఈశ్వరుఁడు నిర్దయుఁడు గాఁడని తెలిసికొను విధమెద్ది?

౭. మనల నీశ్వరుఁడు సర్వదా పంపానముని తలంచుచుండునని మనమెట్లు తెలిసికొనఁగలుగుదుము?

౮. మనుష్యుని ప్రేమనెట్లు తెలిసికొనఁగలము?

౯. ఈశ్వరుని ప్రేమప్రకాశమానమగు నట్టి కార్యములను జూపుఁడు.

౧౦. ఈశ్వరుఁడు మన జ్ఞాన ధర్మశిక్షలకొఱకే కార్యములను జేయుచున్నాఁడో పదియుపమానములను జూపుఁడు.

౧౧. అందఱికంటెను నీశ్వరుని ప్రేమ యధికమని తెలిసికొను విధమెద్ది?

౧౨. "అప్పుడప్పుడు దుఃఖమును గలిగించుటవలన నీశ్వరుని ప్రేమ ప్రకాశమాన మగుచుండును" అను దానిని నొకటి రెండుపమానముల మూలమున బలపఱుపుము.

౧౩. మనకీశ్వరుఁడేల దుఃఖమునుగలిగించుచున్నాఁడో దానిని సకల సమయములయందేల గ్రహింపఁజాలము?

౧౪. ఎప్పుడు దీనిని దెలిసికొనఁజాలమో యప్పు డీశ్వరుని దయావిషయమున నెట్లు భావించుట యుచితము?

## సప్తమపాఠము. భక్తి

మనకుఁ దెలియని యనేకవిషయముల నుపాధ్యాయుని యొద్దఁ బ్రతిదిన మభ్యసించుచుందుము. మనఁగా ననేకశబ్దముల కర్థమును నేర్చుకొందుము. అనేకకథలు విందుము. అనేక దేశచరిత్రలఁ దెలిసికొందుము. అనేకములగు లెక్కల నభ్యసింతుము. అనేక ధర్మసంబంధములగు వాక్యములను నేర్చుకొందుము. ఈవిధముగ నుపాధ్యాయునియొద్ద జ్ఞానలాభమును బొందుటవలన నుపాధ్యాయునిపై మనకెట్టి భావముండును? మనకుఁ దెలియని యనేక విషయముల నాయన దెలిసికొని యున్నాఁడనియు, నందువలన నాయన గొప్పవాఁడనియును మనము చిన్నవాండ్రమనియును దలంతుము. ఈ భావమునే "భక్తి" యని చెప్పుదుము. నీతల్లి జబ్బువలన మంచమునుండి లేచుట లేదనుకొనుము. కొంచెముసేపు విసనకఱ్ఱతో వీచుమని నీతోఁ జెప్పినప్పుడు, నీవాటలయందు మత్తుఁడవై యుండి యామెమాటను

వినక లేక యొకటిరెండుమాటలు మాత్రము వినఁగల్గితో
విసరి యాటలకు వెళ్లితి వనుకొనుము. కాని నీ చెల్లెలాటలను
మాటలను మాని యొక గంటకాలము నీతల్లియొద్దఁగూరుచుండి
వినఁగల్గితో వినకనో నీచెల్లిలిమీఁద నీకెటువంటి భావ ము
దయించునో యోజించుకొనుము. నీ చెల్లెలు నీకంటె మంచి
దని నీవుతప్పక తలంతువు. కాఁబట్టి యామెవిషయమున నీకుఁ
గల భావముపేరు భక్తి యందురు.

నీవును నీతోడి బాలుఁడును తరగతిగదిలో నాడుకొను
నప్పుడు కిటికీ యద్దము బ్రద్దలైనదనుకొనుము. ఇట్టి కార్యమున
కుపాధ్యాయుఁడు దండించునని నీవెఱుఁగియే యుందువు.
అప్పుడు నీతోడిబాలునితో నీపని నావలన జరిగినదిగాదని చెప్పుద
మని నీవు చెప్పినప్పుడు, నీతోడి బాలుఁ డబద్ధమును జెప్పుటకొక
మాత్రమైనను సమ్మతింపక, "నేనబద్ధము చెప్పను. తప్పుపనిచేసి
నప్పుడు శిక్షనుబొందుటయే యుత్తమము" అనుచు నుపాధ్యా
యునితో నిజమును జెప్పినాఁడనుకొనుము. వానిపై నీకప్పుడు
విరక్తి గలిగినఁ గలుగవచ్చునుగాని, నీవన్యాయమును చేసితి
వనియును, నీతోడిబాలుఁ డుచితమగు కార్యమును జేసినాఁడని
యును వివేకము చెప్పును. అంతట నీతోడిబాలునకు సత్యాశ్ర
యమధికము గనుక వాఁడు గొప్పవాఁడనియును నీవు తక్కువయని
యును దెలిసికొందువు. కనుక వానియందు నీకుఁగల భావము
పేరు భక్తి యందురు.

భక్తితత్త్వమెట్టిదో దెలిసికొనుట కింకను బ్రయత్నింపుఁ
డు. జ్ఞానమునందును, ధర్మమునందును, తమకంటె గొప్పవారి
పైన మన కెటువంటి భావముండునో దానినే భక్తి యందురు.

"ఇతఁడు నాకంటె గొప్పవాఁడు" అనుమాట యెప్పుడును హృదయమునం దుండకపోవచ్చును. ఎవనికి ననేకవిషయములు దెలియునో యెవఁడువిస్తారముగఁ దెలిసికొనుటకుఁ బ్రయత్నించుచుండునో, యెవఁడు సత్యవాది, దయాళుఁడు, సాహసుఁడో యట్టివానిని, చూచినప్పుడుగాని, యట్టివాని చరిత్ర వినినప్పుడుగాని, వానియెడల మనకు భక్తి గలుగును. అతఁడు మనకంటె, శ్రేష్ఠుఁడా, నీచుఁడా, గొప్పవాఁడా, లేక కొలఁదివాఁడా యను సంశయము నన్ని సమయములయందును భావింపము. జ్ఞానము వలనఁగాని, చరిత్రవలనఁగాని, శ్రేష్ఠమానవునియెడల స్వభావసిద్ధముగ భక్తి గలుగును. భక్తి గలిగియుండుటయు నుచితము. భక్తిలేనివారికి ధర్మాధర్మజ్ఞానము లేదనికాని, లేక ధర్మాధర్మజ్ఞానమత్యల్పమనికాని, తెలిసికొనుఁడు. ధర్మాధర్మజ్ఞాన మున్నచో ధార్మికమానవులపైని భక్తి తనంతటఁ దానుగ నుదయించును. మనభక్తికిఁ బాత్రులగువారలు మనల నావరించియున్నారు. తల్లి, తండ్రి, అన్న, అక్క, తాత, అవ్వ, పినతండ్రి, పినతల్లి, పెదతల్లి, పెదతండ్రి, అత్త, మామ, తలిదండ్రుల స్నేహితులు మొదలగువారందఱును మనకంటె జ్ఞానవంతులు. ఎవరివ్యాసములు గ్రంథములు చదివి జ్ఞానమును ధర్మమును దెలిసికొనుచున్నామో వారును మనకంటె గొప్పవారు. ధార్మికజీవనుల చరిత్రములు మనకు భక్తిభాజనములు.

ఎవఁడీజగత్తునందలి సమస్తకార్యములను దెలిసికొనుచున్నాఁడో, యెవఁడీయాశ్చర్యకరమగు జగత్తును సృష్టించి రక్షించుచున్నాఁడో, యెవఁడు వివేకముచే ధర్మాధర్మములను దెలియఁజేయుచున్నాఁడో, యెవఁడెల్లప్పుడును మన మంగ

ఖార్థమై ప్రయత్నించుచున్నాఁడో యట్టిపరమేశ్వరుఁడు మన గభీరభక్తికిఁ బాత్రుఁడని సహజముగఁ దెలిసికొనఁ గలుగుదుము.

భక్తివలన మనస్సున కెట్టి యుపకారము గలుగునో భావించిచూతుము. ఉపాధ్యాయుని యధికజ్ఞానముఁజూచి భక్తి గనుపఱచుటవలన నట్టి యధికజ్ఞానమును సంపాదించవలయునను నిచ్ఛ గలుగును. నిజసుఖములను బరిత్యజించి పరసేవ చేయువాని మీఁద మనకు భక్తిగలిగినచో, నాయనవలె మనమును దయాశీలము గావలయునను నిచ్ఛ మనకుఁ గలుగును. నిజసుఖముల మఱచి పరసేవచేయుఁదలంతుము. శిక్షింపఁబడుదుమని యెఱిఁగి యుండియు, నిజమును జెప్పి నిజధర్మమును రక్షించుకొనిన సత్యవాదియు, సాహసియు నగు మనుజునిమీఁద భక్తిగలిగినచో, మనభీరుత్వము దూరమగును. సత్యముమీఁదఁ బ్రేమ హెచ్చుట యగును. సత్సాహసము వృద్ధియగును. అనల్పజ్ఞానము, దయ, సాహసము, సత్యనిష్ఠ, ప్రేమ శీలత, సహిష్ణుత మొదలుగాఁగల సద్గుణములుగల వారిని జూచుటచేఁగాని లేక వారి చరిత్రలను జదువుటవలనఁగాని వారియందు మనకు భక్తి యుదయించును. అందువలన మనమట్టి చరిత్రగలవాండ్రమగుదుము. ఇచ్ఛ వలనను బ్రయత్నమువలనను మనచారిత్రము క్రమక్రమముగ నున్నతావస్థనుబొందును. సాధుపురుషుల సద్గుణములను వినక భావింపక చూడక వినియును వానియందు మనస్సును జొప్పింపక భక్తికిఁ బాత్రమైన వారియందు భక్తిని జూపింపక, నింద హేళనము చేయువా రతి నీచస్వభావులనియును, వా రతి నీచస్థితియం దున్నారనియును, వారి చరిత్ర యున్నతిఁ బొందదనియును దెలిసికొనవలయును.

## ప్రశ్నలు.

౧. మనకంటె జ్ఞానాధికులెవరు? అట్టివారిమీఁద మన కెట్టిభావముండును? దీనిని యుపమానములతో బోధింపుఁడు.

౨. మనకంటె సత్యనిష్ఠయందెవ రధికులో యట్టివారి మీఁద మన కెట్టి భావముండును? ఇందుల కుపమానములఁ జూపుఁడు.

3. భక్తియన నెట్టిది?

४. సీభక్తికిఁ బాత్రులయిన పదిమంది పేరులు చెప్పుము.

౫. భక్తివలన మన కెట్టి యుపకారము గలుగును? అయి దుపమానములఁ జూపుఁడు.

౬. భక్తి లేనిచోఁ గలుగునష్టము లెవ్వి?

౭. మన గభీర భక్తికిఁ బాత్రుఁ డెవఁడు?

## అష్టమపాఠము — ఉపాసన.

ఈశ్వరుఁడందఱకంటెను మన గభీరభక్తికిఁ బాత్రుఁడని సప్తమపాఠమునఁ జదివియున్నాము. జ్ఞానులు మనభక్తికిఁ బాత్రులుగాని జ్ఞానుల జ్ఞానమంతయు నీశ్వరునినుండియే వచ్చియున్నది. మనమును నీశ్వరునినుండియే జ్ఞానమును బొందుచున్నాము. మనుష్యుఁడెంతజ్ఞానియైనను, బుద్ధిమంతుఁడైనను గ్రహించుటకును, దెలిసికొనుటకును వీలుగాని విషయము లనేకము లున్నవి. ఈశ్వరుఁడు జగత్తునకుఁ గర్తయగుటవలన నాయనకుఁ

దెలియని విషయములు లేవు. మఱియును నాయన సర్వజ్ఞుఁడు. సాధుపురుషుల జీవితములందును లోపములుండిన నుండవచ్చును. కాని యీశ్వరున కేవిధమగులోపములు లేవనియును దోషరహితుఁడనియును నిష్పాపుఁడనియు ను సంపూర్ణపవిత్రస్వభావుఁడనియును దయామయుఁడనియును వివేకమువలన మనము గ్రహించుచున్నాము. ఇందువలనఁ బరమేశ్వరుఁడు మన గభీరభక్తికిఁ బాత్రుఁడు గనుక నాయనయం దధికభక్తిని జూపించుట యుచితమని మనము స్పష్టముగఁ దెలిసికొనవలయును.

ఈ విషయమున వివేకము మనకొక కర్తవ్యాంశమును బోధించుచున్నది. సత్యమును బలుకుట పరుల కుపకారమును జేయుట చదువుకొనుట మొదలగు కార్యము లుచితములని వివేకమువలనఁ దెలిసికొనువిధముననే యీశ్వరుఁడు సకలగుణములకు గుణియనియును సర్వదా మనలను రక్షించుచున్నాఁడనియును నెల్లపుడు మంగళమునే సంపాదించు చున్నాఁడనియును దెలిసికొనుచున్నాము. కాఁబట్టి మనపై నెవరికిఁ బరిపూర్ణదయయో యట్టివారిమీఁద భక్తిగలిగియుండ యుచితముగదా! ఆయనదయను భావించినను, నాయన గుణములను దలంచినను భక్తి తనంతటఁ దానుగనే హృదయమునం దుదయించును. ఆయనవిషయమున మనమెంత భావించిన నంతకంత భక్తి యుదయ మగుచుండును. ఈశ్వరుని విషయము నెక్కువగ భావించువారికి భక్తి యెక్కువగఁ గలుగుచుండును. తక్కువగ భావించువారికి భక్తి తక్కువ యగుచుండును.

ఈశ్వరుని విషయము నధికముగ భావించువారల మనస్సు భక్తిపూరితమైయుండును. కనుక నట్టివారికి, భక్తిపూర్ణ

స్థితికి వచ్చుట వలనఁ గన్నీళ్లు దెఱచినప్పుడెల్ల నానందాశ్రుధార ప్రవహించు చుండును. మాటిమాటికిని, మనమున గభీరభక్తి యుదయ మగుటవలన వారెప్పుడు నీశ్వరుని మఱచిపోరు. వారి మనమెప్పుడును భక్తిరస పూరితమైయుండును. ఈశ్వరుని విషయము నధికముగ భావించని వారలకు నధికభక్తి యుదయింప కుండుటయే కాక, యున్న కొంచెము భక్తియును స్వల్పకాలముమాత్రమే యుండును. పరిపూర్ణగుణములు గలిగి పరిపూర్ణదయను జూపించువాని మీఁద స్వల్పభక్తిని గలిగియుండుట యుక్తమమో, లేక, మన గభీరభక్తిని జూపించుట యుక్తమమో యోజించికొనుఁడు. కాని, మన మనస్సు చిన్నది. అందువలన నొక కాలమున నేయీశ్వరునిసకలగుణములను భావింపఁజాలము. మనజీవితకాలమంతయు నాయనగుణగణములను లెక్కింపఁజాలము. ఆయనగుణగణములను భావించుటవలన మనమనస్సునందాయనమీఁదభక్తి గలుగును. ఈభక్తి నాయన గుణములతోఁ బోల్చిచూచిన యెడల నత్యల్పమగును. ఒకఁడు నీకులక్షరూపాయ లప్పిచ్చినాఁడనుకొనుము. నీవువాని యప్పునుదీర్చుటకుఒకరూపాయ మాత్రమిచ్చినావనుకొనుము. ఇందువలననీయప్పెంతస్వల్పముగఁదీర్చినదో గ్రహింపుము. ఈశ్వరుఁడు మనమీఁద దయగలిగి ప్రేమ యను నంతము లేని యప్పును మనకిచ్చియున్నాఁడు. అందుకుఁ గొంచెము భక్తిని మనమాయన కిచ్చినయెడలఁ బైన చెప్పినటు లొకరూపాయకుఁగూడఁ దక్కువ దీర్చినవార మగుదుము. సంపూర్ణముగ నాయన ఋణమును మనము దీర్చుకొనఁజాలము. ఎందువలన ననఁగా, నాయనగుణముల కంతము లేదుగదా! మనమెంతభక్తి గనుపఱచిన

ను మనభక్తికి సీమగలను. కనుక మనము మాటిమాటికి నీశ్వ
రుని గుణకథాగానము చేయుచుండినయెడల క్రమక్రమముగ
మనభక్తి వృద్ధియగుచుండును. ఈశ్వరుని విషయములను భా
వింపక కాని, యత్యల్పముగ భావించుచుఁ గాని యీశ్వరుని యం
దు భక్తి చూపక గాని యల్పముగఁ జూపువారువలెఁ గాని, మన
ముండుట యుచితముగాదు. మాటిమాటికి నీశ్వరుని గుణము
లను భావించుచు నీశ్వరభక్తిరసముతోఁ బూర్ణమగుహృద
యములు గలవారలము గావలయునని ప్రయత్నించుట మన
విధాయకకృత్యము.

భక్తివలన మనకెట్టి యుపకారముగలుగునో దానిని
సప్తమపాఠమునందుఁ జదివియున్నాము. మనకెవరిమీఁద భక్తి
యుండునో వారివంటివారలము గావలయునను నిచ్ఛ మనకుఁ
గలుగును. ఇందువలన నీశ్వరునిపై భక్తి గలిగి యుండుటవలన
మనకెట్టియుపకారముగలుగునో దానిని సహజముగ గ్రహింపఁ
గలుగుదుము. పరమేశ్వరుని జ్ఞానము, పవిత్రత, దయ మొదలగు
వానిని భావించినకొలఁదిని, బరమేశ్వరునిపై భక్తి వృద్ధియగు
చుండును. ఈశ్వరభక్తి వృద్ధియైనకొలఁదిని జ్ఞానులము సచ్చ
రిత్రులము పరోపకారులమును గావలయునను నిచ్ఛ గలుగు
చుండును. కనుక నీశ్వరభక్తి ధార్మికుల మగుట కెట్టియద్భుత
మగు సహాయమో యూహించుకొనుఁడు. వివేకముయొక్క ప్రే
రణలప్రకారము ప్రవర్తించుచు మనోవాక్కాయకర్మముల
యందు బాగుగనడచుకొనుచు, ధార్మికుఁడ వగుటకుఁ బ్రయ
త్నించుటయే నీవిధాయకకృత్యము. ఈకర్తవ్యపాలనముకొఱకుఁ
గల ప్రధానమార్గమును దెలిసికొనుఁడు. ఈశ్వరునియం దెంత

భక్తిపరుడవగుదువో యంతధార్మికుఁడ వగుదువు. సచ్చరిత్రుఁడవగుదువు. కాన నీశ్వరభక్తి వృద్ధినొందు మార్గము నన్వేషించి తెలిసికొనుము.

భక్తి దేనివలనఁ గలుగునో దానివివరముఁ దెలిసికొనఁగలుగుదువు. సుగుణములుగలవారిని జూచినఁగాని వారిని గుఱించి విచారించినఁగాని వారిమీఁద మనకు భక్తి యుదయించును. స్థిరమగుచిత్తముతో నొకనిమిషకాలము నీతల్లి ప్రేమప్రకాశమానమగు కార్యములను భావింపుము. భావించినకొలఁదిని నీచిత్తము భక్తిరసపూరితమగును. కన్నులఁదెఱచిన జలప్రవాహము ప్రసరించును. కనుక నీశ్వరభక్తి నార్జింపవలయునని నీవిట్లే చేయవలయును. ఈశ్వరుని కన్నులతోడఁ జూడఁజాలము. కాన నాయన కార్యములను నలుప్రక్కలఁ జూచుచున్నను సకలసమయములయందు సమస్తకార్యముల నాయన చేయుచున్నాఁడని మనకుఁ దృష్టియుండక పోవచ్చును. మనమనేకసమయములలోఁ బనులతొందరవలన నాయనను మఱచుచుందుము. సర్వదా నాయనను మఱచి తిరిగినను భక్తి యుదయింపదు. ఇందువలనఁ బ్రతిదినమును నియమితసమయములయందు నిశ్చలచిత్తముతోడ నాయనగుణగణములను భావింపవలయును. ఆయన సర్వదా మనలోపలను వెలుపల నున్నాఁడు. ఆయనకు మనమనస్సులోని సంగతులు తెలియును. ఇందువలన గేవల మాయన గుణకీర్తనముమాత్రమే చేయక మనస్సులోని సంగతులను జెప్పుటయుచితము. నీతల్లిగాని, నీస్నేహితుఁడుగాని యితరగ్రామములయం దున్నప్పుడు వారివిషయమును భావింతువు. వారికి జాబును వ్రాయుదువు. కాని వారునీయొద్దఁగూడ

చుండినచోఁ గేవలము వారివిషయమైన చింతనమును జేయుటవలన సంతుష్టిని బొందవు. వారితో మాట్లాడికాని సంతుష్టిని బొందఁజాలవు. మాట్లాడుటవలనఁ బ్రేమ యెక్కువయగును. అందువలన మనలోపలనున్న యీశ్వరునితో సాక్షాద్భావమున మాట్లాడుట యుచితము. సాక్షాద్భావమున నీశ్వరునితోడ మాట్లాడినచో సహజముగ భక్తి యుదయించును. ఈశ్వరునితోడ సాక్షాద్భావమున మాట్లాడుటను "ఉపాసన" యందురు. ఈశ్వరుఁడు లోపలను వెలుపలను సమీపమున నున్నాఁడని తెలిసికొని యాయనతోడ మాట్లాడుట నుపాసనయని చెప్పుదురు.

ఉపాసన మేవిధముగఁ జేయవలయునో గమనింపుఁడు. (౧) స్థిరభావమున నీశ్వరుఁడు మనసమీపమునం దున్నాఁడను దాని సమభావములోనికిఁ దెచ్చుకొనవలయును. దీనినే ధ్యానమందురు. (౨) ఈశ్వరుని గుణగణములను వర్ణింపవలయును. అనఁగా నాయన జగత్తునకుఁ గర్తయనియు నాయనకు సమస్తము దెలియుననియు నాయన సమస్తమైన వారిని బ్రేమించుననియు నాయన పవిత్రుఁడనియును మొదలగు నాయన గుణగణములను దలంచుకొనవలయును. దీనినే యారాధనయందురు. (౩) మనలను రక్షింపవలయుననియును, బోధింపవలయుననియును, సత్యవాదులుగఁ జేయవలయుననియును, మొదలుగాగల కోరికల నీశ్వరుని యెదుటఁ గోరుటను ప్రార్థనయందురు. ఆరాధన ధ్యానము, ప్రార్థన యనునీ మూడంగములును గలిసిన నుపాసన యగును.

అథమము దినమునకు రెండుమారులైన నుపాసన చేయుట యుచితము. ఉదయమున శాంతముగనుండును, మనస్సు

నిర్మలముగనుండును. అప్పటినుండియే దినకృత్యములు (బ్రారం భింపఁ బోవుదుము. కనుక నుదయ ముపాసన కుపయుక్తనమ యము. ఉదయమునఁ బాగుగ నుపాసనను జేసినచో దినమంత యు మనస్సునిర్మలముగ నుండును. కర్తవ్యములను బాగుగ నె ఆవేర్తుము. కనుక నుదయమునసే యుపాసన కర్తవ్యము. దీని తర్వాత సాయంసమయముగూడ శాంతముగ నుండును. దిన మంతయును బనిపాటలవలన మనస్సు చీకాకుగ నుండవచ్చును. అందువలన సాయంకాలమునం దుపాసనను చేసి మనోనిర్మలత్వ మును బొందుట యుచితము. దినమంతటిలో ననేకయబద్ధములు పలికియుండవచ్చును. అన్యాయకార్యములు చేసి యుండవచ్చు ను. ఇందువలన దినమంతటిలోను జేసిన పాపకార్యములకొఱకు నీశ్వరుని సమీపమున క్షమింపవలయునని (ప్రార్థించుటయే కాక యెప్పుడు నిట్టికార్యములు చేయకుండునట్లు ప్రసాదింపవల యునని వేడవలయును. దినమంతటిలో నీశ్వరుఁడుమనమీఁదఁ జూపించినదయాదానమును స్మరించి యాయనకుభక్తితోడఁ బ్రి ణామమును జేయుట యుచితము. ఈకారణములవలన సాయం సమయ ముపాసన కుపయుక్తకాలము. నియమితకాలమునగాక సమయముదొరకినపుడెల్లను, ఈశ్వరునిగుణములను స్మరించుచు మనలనురక్షింపవలయునని (ప్రార్థన చేయుచుండుట యుచితము. ముఖ్యముగ నాహారమును భుజింపబోవునప్పుడును, స్నానపాన యములనను, ఇమువుకొనుటకు మొదలిడినప్పుడును, నూతనవస్త్ర ములు పుస్తకములు లిఖించునప్పుడును, నన్యాయకార్యము లొనర్చునప్పుడును నాయనను విశేషముగ స్మరించుట కర్త వ్యము.

## ప్రశ్నలు.

౧. ఎందువలన నీశ్వరుఁడు సమస్తమైనవారికంటెను మనభక్తికిఁ బాత్రుఁడు.

౨. ఈశ్వరునిమీఁద భక్తిసంబంధమున మనకర్తవ్యమెద్ది?

౩. దేనివలన నీశ్వరభక్తి వృద్ధియగును?

౪. ఈశ్వరభక్తివలన మన కెట్టియుపకారములు గలుగును?

౫. ఈశ్వరభక్తి వృద్ధియగుట కెట్టి యుపాయముల నవలంబించుట యుచితము?

౬. దేని నుపాసనయని చెప్పెదరు?

౭. ఉపాసనకును, జింతనచేయుటకును గలభేదమేమి?

౮. ఉపాసనకుఁ దొడఁగి మనమేమిచేయవలయును?

౯. ఉపాసనాంగములను జెప్పుడు?

౧౦. దినమున కెన్నిమారు లుపాసనచేయుట యుత్తమము?

౧౧. ఎందువలనఁ బ్రాతఃకాల ముపాసనకుఁ దగిన కాలము?

౧౨. ఎందువలన సాయంకాల ముపాసనకుఁ దగిన కాలము?

౧౩. ఏయేసమయములయం దుపాసనను జేయుట యుచితము?

## నవమపాఠము.— తల్లి, తండ్రి.

అష్టమ పాఠమునందు భక్తిపాత్రులకు భక్తిని జూపించుట ఋణమును దీర్చుకొనుటవంటిదె యని చదివియున్నాము. ఋణమును దీర్పకుండుటెట్లధర్మమో గురుజనులకుభక్తిని జూపింపకుండుటయు నధర్మము. భక్తిని జూపించుటవలన మనస్సునకుపకారము గలుగును, చరిత్రబాగుపడునని తెలిసికొనియున్నాము. కనుక దలిదండ్రుల యెడభక్తిని జూపించుట యుచితము. ఇందువలన మనకెట్టియుపకారము గలుగుననువిషయమును విచారించుకొందము.

శిశువు గర్భమునందున్నప్పుడు తల్లి యనేకకష్టములం బొందును. శిశువుజన్మించినతరువాతఁ దలిదండ్రులు పొందుకష్టములను బూర్ణముగవర్ణించుట దుస్తరము. కాని వారుశిశువు ప్రేమించుటవలన ధైర్యముతో సమస్తకష్టములను సహించెదరనుటను మీరుదెలిసికొనియే యున్నారు. అయినప్పటికి నీపుస్తకమునందీవిషయమును వర్ణించుటవలనఁ బ్రయోజనము గలదు. తలిదండ్రులు మనభక్తికిఁ బాత్రులనియును, మనలను బూర్తిగ ప్రేమింతురనియును మనలకుమితిలేనియుపకారములను జేసియున్నారనియును, బైపైన తెలిసికొనుటవలనను, విశేషముగ భావింపకుండుటవలనను, మన మనస్సొకవిధముగ నుండును. తలిదండ్రులు మనకొఱకుఁజేసిన వానిని, జేయుచున్న వానిని, స్థిరముగభావించి చూచినచో మన మనస్సింకొకవిధముగనుండును. అనఁగా వారిపైనిమనభావము భక్తిరసపూరితమగును.

మఱియును వారియెడలఁ జూపవలసినంతగా భక్తిని జూపించుట లేదనియును దెలిసికొందుము.

అనేకులు బాలురుబాలికలు తలిదండ్రుల ప్రేమవిషయమును భావింపరు. అందువలనఁ దలిదండ్రులపైని గనుపఱుచవలసినభక్తిని గనుపఱుపఁజాలరు. మఱియును తలిదండ్రులయెడ ననేక సమయములయందు నగౌరవముఁ జూపెదరు. ఇందువలనఁ దలిదండ్రులు మనకొఱకుఁ జేసినవానిని జేయనున్నవానిని సర్వదా స్మరియించుట యుచితము.

ఒక్కొక శిశురక్షణకొఱకుఁ దలిదండ్రులు చేయుకార్యములను మీమీగృహములయందు మీరు చూచుచుందురు. శిశువునకు గొంచెమును దెలియదుగదా? దేనిని దినవలయునో యెచ్చట పరుండవలయునో యెఱుఁగఁడుగదా? అన్నము దినిపించుట, బట్టలుగట్టుట, పరుండఁబెట్టుట మొదలగు శిశువుయొక్క సంరక్షణకార్యములయం దెప్పుడును దల్లి మునిఁగియుండును. రాత్రులప్పుడప్పుడు శిశువు మేల్కొనియుండును. ఇందువలనఁ దలిదండ్రులు మేల్కొని శిశువున కేది లోపమో తెలిసికొని యాలోపమును దీర్చుచుందురు. ఇందు వలన నిదుర తక్కువయై తలిదండ్రులకు జబ్బు కలుగుచుండును. శిశువు కొంచెము పెద్దవాఁడై నడచుటకుఁ బ్రారంభించు నప్పుడును, దలిదండ్రులు బాలుని జాగ్రత్తగఁ జూచుచుందురు. ఎక్కడికేగినాఁడో, పడినాఁడో, దెబ్బలు తగిలించుకొనినాఁడో యని కుంది తలిదండ్రులాతురులై యుందురు. బాలుఁడు పెద్దవాఁడయిన కొలఁదిని దలిదండ్రుల విచారణ యెక్కువయగుచుండును. ఎచ్చటకేగినాఁడో యెట్టి చిక్కులను దగిలించు

కొనినాఁడో యేదుర్మార్గుల సహవాసమును బట్టినాఁడో, యేదుర్మార్గపు మాటలను బల్కుచున్నాడో, దుర్మార్గపు వ్యవహారములను జేయుచున్నాఁడో చదువుటయందు శ్రద్ధగ నున్నాఁడో లేఁదో యుపాధ్యాయుఁడు మొదలుగాఁగల మాన్యుల నుచిత రీతిని గౌరవించుచున్నాఁడో లేఁదో చెలియలు తమ్ముఁడు మొదలగు వారితోడ నిరుగుపొరుగువారితోడను బాగుగఁ బ్రవర్తించుచున్నాఁడో లేఁదోయని సర్వదా సంతాపించుచుందురు. సంతానము జబ్బుపడినను వారిచదువులయందు శ్రద్ధ చూపించకున్నను, బ్రవర్తనము బాగుండకున్నను దలిదండ్రులకుఁ గలుఁగు మనఃక్లేశమును భావనచేసియును బూర్తిగఁ దెలిసికొనఁజాలము.

మనము శైశవమునను బాల్యమునను, దలిదండ్రుల కేవిధమగు నుపకారమును జేయుటలేదు. పెద్దవారలమైనతరువాతఁగూడఁ దలిదండ్రుల కుపకారమును జేయఁజాలము. కాని తలిదండ్రులు మనమంగళము కొఱకు సర్వదా చింతించుచు నాతురులై యుండు విధమును భావించిచూచినచో నాశ్చర్యము గలుగక మానదుగదా? వారిచదువులు నేర్చికొని, డబ్బు సంపాదించుచు స్వపోషణమును జేసికొను సంతానముపైని గూడఁ దలిదండ్రుల ప్రేమ దూరమగుటలేదు. వారు సర్వదా మనమంగళమునే యోచించుచు, మనసుఖమున సుఖమును, మనదుఃఖమున దుఃఖమును బొందుచుందురు. మనము జీవించి యుండునంతకాలమును దలిదండ్రుల యొక్క ప్రేమ పూరిత నేత్రములు మనమీఁదనె యుండును. సంతానము మరణించినప్పుడు, తలిదండ్రులకుఁ గలుగు దుఃఖమును వర్ణించుట యసా

ధ్యము. సంతానమరణానంతరము కూడ వారిస్నేహము దూర
ముగాఁజాలదు. వారు బ్రతికియున్నంత కాలమును మరణించిన
సంతానమును మఱచిపోఁజాలరు.

మీరు ప్రత్యేకముగా మీమీతలిదండ్రులప్రేమను బ్ర
కాశమానము చేయుచుండు కార్యములను స్థిరభావమున మన
నము చేయుఁడు. ఎవరి తలిదండ్రులు సజీవులో వారు మహాభా
గ్యవంతులు గదా! మఱియును, తలిదండ్రు లమూల్యధనము
గనుక మనగభీరభక్తికిఁ బాత్రులైన తలిదండ్రులయెడ భక్తిఁ
జూపక, మన్నన చేయక, వర్తించువాఁడు మహాపాపి. కనుకఁదలి
దండ్రుల దయావిషయమును సర్వదా భావించుట యుచితము
ఉపాస నాసమయమున విశేషముపకారము గలుగును. వారి
దయావిషయమును సర్వదా భావించుచుండినచో వారిమీఁద
భక్తి నిలిచియుండును. భక్తి నిలిచియుండుటవలన వారిని నిర్ల
క్ష్యము చేయుట కిచ్ఛగింపము. కావునఁ దలిదండ్రుల విషయ
మున నీక్రింద వివరించు కర్తవ్యములను స్మరించుచుఁ బాలనము
చేయుచుండుట యుచితము.

౧ ప్రతి దినమును దలిదండ్రుల దయావిషయమును
భావించుచుండవలయును. ఉపాసనాసమయమున ముఖ్యముగ
భావింపవలయును.

౨ కొన్ని సంసారములలోనిద్దుర పోఁబోవునప్పుడును, నిద్దుర
నుండి లేచినపుడును దలిదండ్రులకు నమస్కరించుపద్ధతి గలదు.
అట్టిపద్ధతి నవలంబించుట మంచిది.

3 చేతనైనంతవఱకుఁ దలిదండ్రులు చేయు కార్యములలో
సహాయము చేయుట యుచితము. వారు చెప్పకపూర్వమె

చేయుటయుచితము. కాని, వారు చెప్పిన తరువాతనైనను జేయుట మంచిది.

౪ మనకంటె మనదలిదండ్రులెక్కువ దెలిసిన వారలని సర్వదాస్మరణయందుంచుకొనవలయును. వారుచేయుమని చెప్పిన పనిని వెనువెంటనేచేయుట యుచితము. చేయుమనిచెప్పిన నకార్యమునకుఁ గారణముదెలియకున్నను జేయుటయుచితము. తలిదండ్రులుచేయు సకలకార్యముల కారణములను బిడ్డలు గ్రహించుట యసంభవముగదా. ఆటలు పిల్లలకు మిగుల బ్రియములు. అందువలన నాటలువదలి యింకొకకార్యమును జేయుమని చెప్పినచోఁ బిల్లల మనస్సునకు విరక్తి గలుగును. కాఁబట్టి ముందుగా నీకార్యము, లన్యాయములు లేక, యనావశ్యకములని తోఁచవచ్చును. కనుకఁ దలిదండ్రులు చేయుమని చెప్పిన కార్యము, నీకుబాగుండని యెడల నీక్రింది విధమున భావించుట యుచితము. ఈపని నాసుఖమునకు నష్టమును గలిగించుచున్నది, కనుక నిది మంచిపనియని మనమునకుఁ దోఁచుటలేదు, అయినను దలిదండ్రులు దీనిని బాగుగఁ దెలిసికొనియే చెప్పియుందురు. కనుక నీకార్యమును జేయుట నా కుచితము.

౫. ఎప్పుడయినను దలిదండ్రులు చెప్పిన కార్యములు బాగుగయోజించి చూచినప్పుడుగూడ నన్యాయమని నీకుఁదోఁచినప్పుడును, నుపాధ్యాయులు జ్ఞానులైన ననేకులు గొప్పవారు నన్యాయమని చెప్పినప్పుడును, శాంతినమ్రభావములతోడ నీకార్యములను గుఱించి తలిదండ్రులతోడ ముచ్చటింపవలయును. ఏ తలిదండ్రులైన నజ్ఞానముచేత సంతానమున కబద్ధము పల్కవలయునని చెప్పినను భక్తిచూపించుట కుచితముగాని వా

లకి భక్తిచూపింపవలయునని చెప్పినను, వయసువచ్చిన సంతాన మీకార్యము నా కధర్మమని తోఁచుచున్నదని నమ్రభావము తోడఁ దలిదండ్రులకు విన్నవించుకొనవలయును. వివేకము నిషేధించుచున్న కార్యములను జేయుమని ధార్మికులగు తలిదండ్రులెప్పుడును బలవంతము చేయరు. వివేకము ప్రకారము ప్రవర్తించుటయే ధార్మికులగు తలిదండ్రుల యిచ్ఛ. మఱియుఁ దలిదండ్రులు వివేక వాణి ప్రకార మాజ్ఞాపించిన నాజ్ఞను బరిపాలించుట యుత్తమము గాని యెప్పుడైన నజ్ఞానముచేతఁ దలిదండ్రులు వివేక వాణికి వ్యతిరేకమగు కార్యములను జేయుమని బలవంతపఱిచినచోఁ గూడ సుఖముగ నా కార్యమును బరిత్యజింపవలయును. కాని యిట్టిసమయము లందును గూడ కఠినమగు మాటలతోడను క్రియలతోడను దలిదండ్రుల మనమునకు బాధగలిగించుట యుచితముగాదు. వారియాదేశమున దోషము గాన్పించినను గూడ వారికొఱకు మనము చేయవలసిన విధాయక కృత్యములను మఱచిపోవుట దోషము. మన మెల్లప్పుడును దలిదండ్రులు మన గభీరభక్తికిఁ బాత్రులని మనమునం దుంచుకొని సేవించుట ధర్మము.

౬. తలిదండ్రుల విషయమున సర్వదా వినీతభావముతో నడచుకొనుట యుత్తమము. కోపమునఁగాని విరక్తిబొంది కాని యెప్పుడును కఠినమగు మాటలచేతఁగాని ప్రవర్తనవలనఁ గాని దలిదండ్రుల మనమునొప్పించుట యుచితముగాదు.

౭. తలిదండ్రులు జబ్బుపడిన సమయమున విశేషశ్రద్ధతో శుశ్రూషను జేయుట యుచితము. అందువలన మనకెట్టి కష్టము గలిగినను ధైర్యముతో నాకష్టములను సహించుట

యుచితము. దలిదండ్రులు మనకుఁ జేసిన యుపచారములతో మనము చేయు శుశ్రూషను బోల్చిచూచినచో మనము చేయు శుశ్రూష లెట్టివి యయినను నత్యల్పములని గ్రహింపఁగలుగుదుము. తలిదండ్రుల ఋణమును బూర్ణముగఁ దీర్చుకొనుట మనకసంభవము. అందువలన వారికి శుశ్రూషలు చేయు సమయము తటస్థించుట మన భాగ్యమని తలంచుట యుచితము. మఱియును శుశ్రూషలు చేయునప్పుడు మనకుఁ గష్టములు గలిగినచో వాని కష్టములు మంగళకరములని విశ్వసింపవలయును.

౮. ఎప్పుడైనను దలిదండ్రుల విషయమున నన్యాయముగ నడచుకొనినచో నప్పుడది యన్యాయమని నీవు గ్రహించిన వెంటనే వారిని క్షమాపణఁగోరుట యుచితము. మఱియు నెప్పుడును దలిదండ్రుల విషయమున నన్యాయముగ నడచుకొనకుండునట్టులు మనమునకు బోధఁ జేయుచుండవలయునని సర్వదా భగవంతుని బ్రార్థించుచుండవలయును.

## ప్రశ్నలు.

(౧) ఎందువలనఁ దలిదండ్రుల దయా విషయమును సర్వదా భావించుట యుచితము?

(౨) ఎంతవఱకుఁ దలిదండ్రుల దయావిషయమును వివరింపఁగలము?

(3) వారివిషయమున మనమెట్టులు నడచుకొనుట యుచితము?

(౪) వారుచేయుమని చెప్పినకార్యములకుఁ గారణములు దెలియనప్పు డేమిచేయుట యుచితము?

(౫) తల్లిదండ్రుల కష్టస్థితిగలిగినప్పు డేమిచేయవలయును?

(౬) తల్లిదండ్రులు స్పష్టముగ వివేకమునకు విరుద్ధములగు కార్యములను జేయుమని చెప్పినప్పుడు మన మేమి చేయుట యుచితము?

(౭) తల్లిదండ్రులకు శుశ్రూషలు చేయునప్పుడు కష్టముగ నుండినచో నేమనిభావించుట యుచితము?

(౮) వారివిషయమున నన్యాయముగ నడచుకొనినచో నేమిచేయవలయును?

## దశమపాఠము — ఉపాధ్యాయుడు.

పాఠశాలలో మీరు ప్రతిదిన మెన్నియో సంగతులు నేర్చుకొందురు. వారము, మాసము, వత్సరమగు నప్పటి కెన్నిసంగతులు దెలిసికొందురో విచారించి చూడుడు. మీవిద్యాభ్యాసకాలమున ననేకశబ్దములు, వాక్యార్థములు కథలు కర్తవ్యములను దెలుపుసూత్రములు, దేశచరిత్రలు, మహాపురుషజీవితములు, వస్తుతత్త్వములు మొదలగువాని నభ్యసింతురు. ఈవిద్యాభ్యాసమువలన బాలకత్వము దూరమగుటయేకాక క్రమక్రమముగ జ్ఞానియును, కార్యప్రవీణుడవును నగుదువు. ఇందువలన నీవు సంసారమును బరిపాలింపగలవాడ వగుదువు. వర్తకము లేక, యుద్యోగము చేయగలుగుదువు. ఇతరులకు విద్యచెప్పగలిగియుందువు. వ్యాసములు పుస్తకములు వ్రాయగలిగియుం

దావు. మంచి భాషలో నుపన్యాసములిచ్చి దేశసేవచేయఁగలిగి యుందువు. మఱియును నీసకలకర్తవ్యకార్యముల కొఱకు నీవు సమర్థుఁడ వగుదువు. ఈ సకలకార్యముల కుపయుక్తుఁడ వగుటకు నీవు ప్రతిదినమును వృద్ధిపొందుచుందువు. గురువుయొక్క ప్రసాదమువలన నీకీయుపకారములు గలుగుచున్నవి. గురువుయొక్క సహాయము లేనిచో నీవువృద్ధిలోనికి రాఁజాలవని సర్వదా మనస్సునం దుంచుకొనుము.

తలిదండ్రుల గుణగణములను సర్వదా భావించుచుండు విధముననే యుపాధ్యాయుని గుణగణములను సర్వదా భావించుచుండుట యుచితము. ఇట్లు భావించుచుండినచో నుపాధ్యాయులయెడ భక్తి గలుగుటయేకాక భక్తి క్రమక్రమముగ వృద్ధిఁ బొందును. ఉపాధ్యాయుఁడు మీకంటె ననేకవిషయములను బాగుగ దెలిసికొనియున్నాఁడు. మీరు చేయఁజాలనికార్యముల నాయన సులభముగఁ జేయఁగలిగినశక్తిని గలిగియున్నాఁడు. ఆయనకు మీయందుఁగల దయ, నాయన మీబాగును గోరుచుండు విధము, నాయనసాహాయమువలన శ్రేష్ఠమానవుఁడగుచుండుటయును, సర్వదా చింతించుచుండుఁడు. ఉపాధ్యాయుని యెడ భక్తిని జూపించుచుండుటవలన మహోపకారముగలుగును. భక్తినిజూపింప కుండుటవలన నెక్కువ యనిష్టము గలుగును.

జ్ఞానియెడల భక్తినిజూపించుట జ్ఞానము నాదరించుటయె కదా! జ్ఞానమునకు వెలలేదు. జ్ఞానలాభమును బొందినచో మనము శ్రేష్ఠమానవుల మగుదుము. జ్ఞానియెడల భక్తిని జూపించినకాలఁదిని మనస్సు జ్ఞానముయొక్క శ్రేష్ఠత్వమును

గ్రహించుచుందురు. జ్ఞానముయొక్క శ్రేష్ఠత్వమును గ్రహించినకొలఁదిని జ్ఞానముమీఁద నాదరము గలుగుచుండును. ఉపాధ్యాయునికి భక్తిని జూపినకొలఁది వారు చెప్పు వాక్యములయందు మనోయోగ మధికమగుచుండును. అందువలన జ్ఞానలాభమును బొందవలయునను నిశ్చయ మనురాగమును గలుగును. జ్ఞానముమీఁద ననురాగము గలిగినకొలఁదిని విద్యాభ్యాసమునందు మిక్కుటముగ బనిచేయుదురు. కావున నుపాధ్యాయునకు భక్తిని జూపించుటవలన మన కెట్టియుపకారము గలుగునో చూడుఁడు! ఉపాధ్యాయునకు భక్తిని జూపనివారు జ్ఞానముయొక్క విలువను దెలిసికొనజాలకుండుటయే కాక జ్ఞానము నాదరింపరు. మఱియును శిక్షకుఁడు చెప్పుమాటలయందు వారి మనసుండదు. విద్యాభ్యాసమునం దుత్సాహమును జనింపదు. జ్ఞానము నాదరింపనివారును నుపాధ్యాయునికి భక్తిని జూపనివారును మూర్ఖులని మీరు స్పష్టముగఁ దెలిసికొనవచ్చును ఉపాధ్యాయుని వాక్యములమీఁద మనసుంచక యుత్సాహముతోఁ జదువుకొననిచో మూర్ఖత్వమే నిలిచియుండును. అందువలన వయసు వృద్ధియైనకొలఁదిని జ్ఞానము వృద్ధిగాదు. బుద్ధి వికసింపదు. ప్రాతచదువులలో శక్తి వృద్ధిఁబొందదు. ఉపయుక్తుఁడగు మనుజుఁడుగ గాఁజాలఁడు. ఉపాధ్యాయునకు భక్తిని జూపించుటకును జూపింపకుండుటకును నెంత భేదము గలదో విచారించిచూడుఁడు. ఉపాధ్యాయునకు భక్తిని జూపనివాఁడు దప్పుపుచ్చుకొని యప్పుతీర్చనివంటివాఁడు. కావున సర్వదా యుపాధ్యాయునియెడ భక్తిని జూపించుట యుచితము. ఉపాధ్యాయుని విషయమున భక్తిని ప్రకాశమానముచేయని చింతవలను

చింతింపకుము. అట్టిమాటలను వక్కాణింపకుము. అట్టికార్యములను జేయకుము. ఉపాధ్యాయుని విషయమున నీక్రిందవివరించిన నియమములను సర్వదా స్మరణయందుంచుకొనుట యుచితము. (౧) ప్రతిదినము ఉపాధ్యాయుని ప్రథమ దర్శనమునను ఉపాధ్యాయునియొద్ద సెలవు గైకొనునప్పుడును వందనములను జేయుము. (౨) ఉపాధ్యాయుని సమీపమునఁ జేతులు, కాళ్లు తల మొదలగు నవయవములను గదలింపక స్థిరముగగూర్చుండుము. (౩) ఉపాధ్యాయునియెదుట బిగ్గరగమాటలాడకుము (౪) ఉపాధ్యాయునితోడ మాట్లాడునప్పుడు "అయ్యా, ఆజ్ఞ" అను సన్మానసూచకమగు శబ్దముల నుపయోగింపుము. (౫) మాట్లాడునప్పుడాయన మొగమువంక నెగాదిగఁ జూడకుము. ఇట్లు చూచుటవలన వినయము ప్రకాశముగాదు. అందువలనఁ దలను గొంచెమువంచి మాటలాడవలయును. (౬) ఆయన వాక్యములను మనోయోగసహితముగ వినవలయును. మాటలాడునప్పుడు దిక్కులుచూడకుము. శ్రద్ధగ వినుచుండుము. ఈసమయమునం దెవరైనను నిన్నుఁ బిలచినచో వారిపిలుపును మనమునకు రానీయఁగూడదు. ఇతర కార్యము లేక యితర వాక్యములయందు మనస్సుంచుటయు నావశ్యకమైనచో నాయన యనుమతిని బొందవలయును. (౭) ఉపాధ్యాయుడు మాటలాడునప్పుడు మాటలాడకూడదు. ఆయన మాటలాడునంతవరకును నిశ్శబ్దముగ వినుచుండవలయును. ఆయన మాటలాడుట పూర్తియైనపిమ్మట చెప్పఁదలచినదానిని జెప్పవలయును. (౮) ఉపాధ్యాయునితోడ నేవిధమగు పరిహాసమును జేయఁగూడదు. ఉపాధ్యాయుడు పరిహాసపుమాటలను బల్కి

నను మాఱుపలుకఁగూడదు. ఆయన పెద్దవాఁడుగనుకఁ బరిహాసము చేయుట కాయన కధికారముగలదు. కాని యాయనను బరిహాసము చేయుటకు నీ కధికారము లేదు. (౯) ఉపాధ్యాయుడు చెప్పినపాఠమును శ్రద్ధతోఁ జదువుము. పాఠమును శ్రద్ధతోఁ జదువనిచో నీకు నష్టముగలుగుటయే కాక యుపాధ్యాయునియం దలక్ష్యము చూపినవాడవగుదువు. కానఁ బాఠమును శ్రద్ధగఁ జదువుచుండవలయును. (౧౦) ఉపాధ్యాయుని సమ్ముఖమునఁ దోడివిద్యార్థులకు కథలు, పరిహాసములు చెప్పి నవ్వకూడదు. ఇటులు చేసినచో నుపాధ్యాయునియెడ నగౌరవమును జూపించినవాడవగుదువు. నీతోడి విద్యార్థియొద్దనుండి నీవేదయిన వస్తువును దీసికొనవలసివచ్చినప్పుడుగాని యవశ్యముగు నొకటి రెండు మాటలను మాట్లాడవలసివచ్చినప్పుడుగాని మెల్లమెల్లగ నడుగుము. విస్తారముగ మాట్లాడవలసియుండినచో నుపాధ్యాయుని యనుమతిని బొంది మఱిమాటలాడుము. (౧౧) ఉపాధ్యాయుని విషయమున సాహసకార్యమునుగాని తప్పుపనినిగాని చేసినప్పుడు వెంటనే శుభ్రభావమున నుపాధ్యాయుని క్షమాపణమును వేఁడుము. (౧౨) ఉపాధ్యాయుఁడు నీవు చేసినతప్పుపనికి శిక్ష నువిధించినచో నాశిక్షను వెంటనే స్వీకరింపుము. నీవు తప్పుపనిచేయ లేదని దలంచినచో సమయమున్న యెడల నీనిర్దోషిత్వమును మనవిచేసికొనుము. కాని సమయము లేనందువలన నుపాధ్యాయుడు నీమాటల వినుట కిచ్చగింపనియెడలఁగాని యుపాధ్యాయునకుఁ దెలియఁజెప్పుటకు నీకు సాధ్యముగానియెడలఁగాని నిర్దోషివనితలఁచుచు నుపాధ్యాయుఁడువిధించు శిక్షనుబొందుము. ఆయనసీకంబె వనేకసంగతులను

బాగుగఁ దెలిసికొనియున్నందున నాయన భ్రమపడుటకలుగును
నీవు భ్రమపడుట కెక్కువ యవకాశముండును. అప్పుడప్పు
డాయనయును భ్రమపడవచ్చును. అయిన నాయనవిధించు
శిక్షను బొందుట కర్తవ్యము. ఇందువలన నీకు గష్టముకలిగి
నను గలుగవచ్చును. కాని యుపాధ్యాయునిమాటలు విననిచో
నీకును నీతోడి విద్యార్థులకును మిక్కుటమగు నష్టముగలు
గును. విద్యార్థు లుపాధ్యాయునిమాటలు విననిచో వారిని
శిక్షించుటకును వృద్ధిలోనికిఁ దీసికొనివచ్చుటకు నుపాధ్యా
యునకు వీలుండదు. (౧౩) మీగృహమునందుఁగాని యుపా
ధ్యాయుఁడెదుట లేనప్పుడుగాని యాయన పేరును లేక యుపా
ధిని యుచ్చరింపవలసి వచ్చినచో పేరుచివరను "గారు" అను
పదమును గలిపి మాట్లాడవలయును. అనగా నుపాధ్యాయుడు
గారని మాటలాడుకొనవలయును. కేవలము పేరుతో నుపా
ధితో మాత్రము పిలువగూడదు. అనగా "ఉపాధ్యాయుడు"
అని పిలువఁగూడదు. "వచ్చినాఁడు వెళ్ళినాఁడు" అని యుపాధ్యా
యునిగుఱించి మాటలాడక "వచ్చినారు వెళ్ళినారు" అని మాట
లాడవలయును. (౧౪) ఉపాధ్యాయుని నితరులయెదుట నెప్పు
డును నిందించగూడదు. ఉపాధ్యాయుడు మాట్లాడునప్పుడును
నడచునప్పుడును నేవిధమగు లోపములు గనుపడినను నాలోప
ముల నితరులయొద్ద జెప్పి నవ్వఁగూడదు. గేలిచేయఁగూడదు.
(౧౫) తలిదండ్రులకును బుత్రులకును గల సంబంధ మెంత
తెగకయుండువిధముననే శిష్యునకు నుపాధ్యాయునకును గల
సంబంధ మెంతతెగకయుండవలయును. స్వతంత్రుడైన పుత్రుడు
దలిదండ్రులకు భక్తిని జూపించువిధముననే యుపాధ్యాయుని

యొద్దజదువు మానినతరువాతఁ గూడ శిష్యుఁడువిధాయకముగ నుపాధ్యాయునకు భక్తిని జూపింపవలయును. అనేకస్థలములలో దలిదండ్రులకంటెఁ బుత్రుఁడు గుణవంతుఁడును విద్వాంసుఁడును గావచ్చును. కాని తలిదండ్రులమీఁదభక్తి యించుకమాత్రమైనను దఱుఁగరాదు. ఇటులే యుపాధ్యాయునికంటె శిష్యుఁడు క్రమక్రమముగ నెక్కుడువిద్య నభ్యసింపవచ్చును. కాని యుపాధ్యాయునకుఁ బూర్వమువలెనే భక్తిని జూపించుట యుచితము. మఱియు జేతనైనంతవఱకు సహాయమును జేయుచు శుశ్రూషలు చేయుచుండుట కర్తవ్యము.

ప్రశ్నలు.

(౧) ఎందువలననుపాధ్యాయుఁడు మనభక్తికిఁ బాత్రుఁడు?

(౨) ఉపాధ్యాయునకు భక్తినిజూపించుటవలన మనకెట్టి యుపకారము గలుగును?

(3) వారికి భక్తి చూపింపని యెడల మనకుఁ గలుగు నష్టమెద్ది!

(౪) ఉపాధ్యాయుని విషయమున మనకర్తవ్యములలో మొదటిదైనదానిని జెప్పుఁడు.

(౫) ఆయన యుపదేశములయందు మనసుంచి సమయమున నెట్టినియమములకు లోఁబడియుండవలయును?

(౬) ఆయనతో మాటాడునపుడే రెండునియమముల ప్రకారముండవలయును?

(౭) తొమ్మిదవ పదవ నియమములెవ్వి?

(౮) ఉపాధ్యాయుని విషయమున నన్యాయముగఁ బ్రవర్తించినచో నేమిచేయవలయును?

(౯) ఉపాధ్యాయుఁడు పిలుచునప్పు డేనియమము ననుసరింపవలయును?

(౧౦) మిగత రెండునియమము లెవ్వియో చెప్పుము.

## ఏకాదశపాఠము—ఆచార్యుఁడు.

సమాజమందిరము, నీతివిద్యాలయము, బ్రాహ్మవిద్యాలయము, మొదలగు ధర్మవిద్యను బోధించుస్థలములయందును, మనగృహములయందును, ధర్మవిద్యను బోధించువారి నాచార్యులని చెప్పుదురు. ధర్మాధర్మములయొక్కయు సత్యాసత్యములయొక్కయు స్వరూపము నాచార్యుఁడు మనకుఁ దెలియఁజెప్పును. ఆచార్యుఁడు మనవివేకమును బ్రజ్ఞను బ్రకాశింపఁజేయును. బయటివస్తువులను జూచుటకు, మనకన్ను లెంత ప్రయోజనకరములో లోపలితత్త్వమును జూచుటకుఁ బ్రజ్ఞయంత ప్రయోజనకరము. కన్నులు లేనియెడల బయటివస్తువులను జూడఁజాలని విధముననే వివేకము ప్రజ్ఞ లేనియెడల ధర్మాధర్మములను సత్యాసత్యములను దెలిసికొనఁజాలము. వివేకము ప్రజ్ఞ యాత్మకుఁగన్నులవంటివి. ఆత్మయొక్క కన్నులను బ్రకాశమానముగఁ జేయువారికంటె మనకు మహోపకారు లెవ్వరు? ఆచార్యుఁడు మనమంగళమును గోరుచుండును. మనము సచ్చరిత్రులము గావలయుననియును నీశ్వరుని దెలిసికొని భక్తియుక్తు

లము గావలయుననియును సర్వదాయాచార్యుఁడు గోరుచుం డును. నానాప్రకారములఁ బ్రయత్నించుచుండును. మనకు మహోపకారియును, జ్ఞానమునను జరిత్రవలనను మనకంటె జాలగొప్పవాఁడును నగు నాచార్యుఁడు మనగభీరభక్తికిఁ బాత్రుఁడు. ఆయనయెడల మనము భక్తిజూపినకొలదిని మనకు మంగళము చేకూఱుచుండును. ఉపాధ్యాయుని సంబంధమునఁ జెప్పిన నియమములన్నిటి ప్రకారము నాచార్యుని విషయమునఁ బ్రవర్తించుచుండుటయేకాక యాచార్యుని విషయమునఁ బ్రవర్తింపవలసిన విశేషకర్తవ్యము లింకనుగలవు. కనుక నాచార్యుని విషయమున నీక్రిందినియమముల ప్రకారము ప్రవర్తించుచుండుట కర్తవ్యము. (౧) ఆచార్యుని దర్శనము గృహమందుగాని యితరస్థలములందుగాని యయినప్పుడు, నాయనయొద్ద సెలవుగైకొను నప్పుడును భక్తితోడఁ బ్రణామమును జేయుచుండవలయును. (౨) ఆచార్యుని నానుకొని కూరుచుండ వలదు. ఆచార్యునకుఁ గొంచెము దూరమునందుఁ గూర్చుండవలయును. (3) ఆచార్యుని యెదుట నమ్రభావమున నుండుము. (౪) ఆచార్యుని యనుమతి లేక యుపదేశము పూర్తియై యాయన లేచునంతవరకును లేచి రాఁగూడదు. లేచివచ్చినచో నాయన విషయమున నీ వనాదరము ప్రకాశమగును. కనుక లేచిరాకుండుటకు సిద్ధపడి యుపాసనాస్థలమునకుఁ బోవలయును. అత్యావశ్యకమగు కార్యముండి లేచివచ్చుట తటస్థించిన చోఁ దిమ్మట నాచార్యుని క్షమాపణమును గోరుటయుచితము. (౫) ఉపదేశము పూర్తియయిన తర్వాత వంగతులన్నియు మరల జెప్పఁగలుగునంత శ్రద్ధతో నుపదేశమును వినవలయును. ఉప

దేశము యొక్క భావమును దినచర్య పుస్తకమునందు వ్రాసి యుంచుకొనుట యుత్తమము. (౬) ఉపదేశములోని సంగతులు తెలియనిచో నాచార్యుని ప్రశ్నించి సంగతులు దెలిసికొనుటకుఁ బ్రయత్నింపుము. ఆయనతోడ ననావశ్యకమగు వాదము చేయకుము. ఆయనను వాదమునందు నోడింపవలయునను ప్రయత్నము చేయవలదు. (౭) ఆచార్యుని యుపదేశమును విన్న మాత్రముననే యూఱడిల్లవలదు. ఉపదేశములోని విషయములను జింతనచేసి వాని ప్రకారము నడచుకొనుటకుఁ బ్రయత్నింపుఁడు. (౮) ఆచార్యుఁడు, ప్రజ్ఞావివేకముల వలన దెలిసికొని మనకు ధర్మాధర్మములను నీశ్వరుని నాత్మను బోధించుచుండును. ఇందువలన నాయన యుపదేశములను గ్రహించుచుండుట యుచితము. ఆయన సత్యములని ధర్మములని చెప్పు వాని ననేక సమయములయందు మనము ప్రజ్ఞావివేకముల వలన సత్యములు ధర్మములని తెలిసికొనుచుందుము. అప్పుడప్పుడు దెలిసికొనఁజాలకపోవచ్చును. కాని మన జ్ఞాన మత్యల్పమగుటవలన నాయన వాక్యములలోని సత్యము గ్రహింపఁజాలకున్నామనియుఁ గ్రమక్రమముగ గ్రహింపఁ గలుగుదుమనియు భావించి యుపదేశమును స్వీకరించుట యుచితము. ఆచార్యుఁడు చెప్పిన వానిలో నేదయిన నొకటి యెంతవిచారించినను స్పష్టముగ భ్రమలోఁ గూడుకొన్నదని తోఁచినప్పుడా భ్రమతోఁ గూడుకొనిన దానిని స్వీకరింపకుండుట యుచితము. మఱియును స్పష్టముగ దేనిని భ్రమతోఁ గూడుకొన్న వాక్యమని తెలిసికొనుచున్నామో దానిని యంగీకరించుట యసంభవము గదా. కాని యాచార్యుఁడేదియో యొక భ్రమవాక్యమును

చెప్పినాఁడని భక్తిని జూపకుండుట యుచితముగాదు. (౯) ఆచార్యునియొద్దఁ గనుపడుదోషముల నవలంబింపఁగూడదు. వానిని నితరులతోఁ జెప్పి నిందింపఁగూడదు. ఆయన వివేకవంతుఁడును బ్రజ్ఞావంతుఁడు నగుటవలన, నిజదోషములను దెలిసికొనుననియును, లేక శీఘ్రముగ గ్రహింపగలుగుననియును త్వరలో వానిని బరిత్యజించుననియును విశ్వసించియుందును. ఆయన లోపములకు దుఃఖానుభవమును బొందుచు నాలోపములను దూరముచేయవలయునని పరమేశ్వరునిఁ బ్రార్థింతును. సామాన్యమగు లోపములనుబట్టి యాయన యుపదేశములను మఱచిపోకుము. ఆయన విషయమున భక్తిహీనుఁడ నెప్పుడుగాను. (౧౧) నీ సాధ్యమైనంతవఱకు నాచార్యునకు శుశ్రూష చేయుము. తలిదండ్రులమీఁదఁ జూపుభక్తికిఁ దక్కువగాని భక్తిని నాచార్యునిమీఁదఁ జూపుము. ఆయన సంసారములోని వారినందఱను నీసంసారములోని వారివలెఁ జూచుచు నాయన చనిపోయినప్పుడును, లేక, గృహమునందు లేనప్పుడును. కష్టములు సంభవించినప్పుడును సర్వవిధముల వారికి సహాయమును జేయుచుండుము.

మనకు నియమిత ప్రకారము ధర్మోపదేశము చేయువారుగాక ధర్మోపదేశము చేయువారింకను ననేకులు గలరు. జ్ఞానమువలనను జరిత్రవలనను గొప్పవారగు వారియొద్దనుండి మన మనేకసంగతులు గ్రహించుచుందుము. ఇట్టివారందఱును మన భక్తికిఁ బాత్రులు. మనము వారి ధర్మోపదేశములను సత్యములనియు నుపకారకములనియును, విశ్వసించి గ్రహించి పాలనము చేయుచుండుట మనకుఁ గర్తవ్యము. ఇందువలన జగ

త్తునందలి సమస్తమైన వివేకవంతులును, బ్రజ్ఞావంతులును, మనకు నాచార్యులు లేక, యుపదేష్టలవంటివారై యున్నారు. కాని వారియందు నేకొంచె మన్యాయము నసత్యమును గాన్పించినను బరిత్యజింపవలయును.

ప్రశ్నలు.

౧. ఎవరి నాచార్యుఁడందురు?

౨. ఆచార్యుఁడు మనకేమి యుపకారమును జేయును?

3. " వివేకము, ప్రజ్ఞ, యాత్మకు నేత్రముల వంటివి " అనఁగానేమి?

౪. ఆచార్యుని విషయమున మొదటి మూఁడు కర్తవ్యములెవ్వి?

౫. ఆచార్యుని యుపదేశములను వినునప్పుడు పాలింపవలసిన రెండు నియమము లెవ్వి?

౬. ఆచార్యుని యుపదేశములను బాలించు విషయముఁన నియమములెవ్వి?

౭. ఆచార్యుని విషయమునఁ జివర రెండునియమము లెవ్వి?

౮. నియమితముగ ధర్మోపదేశమును జేయువారు గాక తక్కినవారి విషయమున మనకర్తవ్యములెవ్వి?



## ద్వాదశపాఠము—శాస్త్రములు.

---

పరమేశ్వరుఁడు మానవ హృదయములందు సత్యమును ప్రకాశింపఁ జేయుచున్నాఁడనియు, సాధుత్వమును మంచికోరికల నుదయింపఁ జేయుచున్నాఁడనియు, నిదివఱకే చెప్పియున్నాము. ఈవిధముగ నీశ్వరుఁడు మానవుల హృదయములం దెన్నియో సత్యములను బ్రకాశింపఁ జేయుచున్నాఁడు. మఱియు నెంతయో సాధుభావమును బోధపఱిచియున్నాఁడు. ఇంకను దెలియఁజేయుచున్నాఁడు. మన భాగ్యమెట్టిదియో యోచించి చూచుకొనుఁడు. ప్రపంచములోని మానవులా మంచిమాటలను నష్టము గానీయక యత్నముతో జాగ్రత్తఁ జేసియున్నారు. మంచివాక్యములను యత్నముతోడ వ్రాసియుంచిన గ్రంథములును, మనుష్యునియొక్క కర్తవ్యములను గుఱించి వ్రాయఁబడియున్న గ్రంథములను శాస్త్రములని చెప్పుదురు. శాస్త్రములు జీవములేని వస్తువులే కాని, శాస్త్రములను లిఖించినవారలు మనభక్తికిఁ బాత్రులగుటవలనను, శాస్త్రములయందు, వారి యుపదేశములును, జరిత్రవిషయములును వ్రాయఁబడియుండుటచేతను శాస్త్రములు మనకుఁ బరమాదరణీయమైన వస్తువులు. ఉపాధ్యాయునియొక్కయు నాచార్యునియొక్కయు నుపదేశములను వినుటవలన నుపకారమును బొందు విధముననే శాస్త్రములను జదువుకొనుటవలన మన ముపకారమునుబొందుదుము. మన మనేక సమయములయందు కర్తవ్యములనుమఱచి పోవుచుందుము. మఱియు నప్పుడప్పుడు దెలిసినవానినిగూడ

మఱచి పోవుచుందుము. శాస్త్రములు వీనినన్నిటిని మనకు మఱవకుండఁ జేయుచుండును. మన మనేక సమయములలో యోచించనందువలనఁ గర్తవ్యములను దెలిసికొనఁజాలని వార మగుదుము. శాస్త్రములు చదువుటవలన మన మనమునందు విచారణ ప్రారంభమగును. అందువలన నుజ్జ్వలరూపమున మన కర్తవ్యములను దెలిసికొనఁ గలుగుదుము. సహాయము లేక విచారించుటవలన మన మనేక సత్యములను దెలిసికొనఁజాలక పోదుము. శాస్త్రములను జదువుటవలన జ్ఞానులయొక్క యున్నత భావములు మనమునఁ బ్రవేశించును. వారు చెప్పిన సత్యములను దెలిసికొందుము. ముఖ్యముగ శాస్త్రములయందు సాధువులయొక్క యుత్కృష్టచరిత్ర విషయములను జదువుటవలన, మనమును వారివలె నుత్కృష్టచరిత్రగలవార మగుటకుఁ బ్రయత్నింతుము. ఈకారణముల వలన శాస్త్రములను శ్రద్ధతోఁ జదువుట మన కర్తవ్యము.

నిన్నెఱిఁగిన యేబాలుఁడైనను నితరులయెదుట, నిందించినచోఁ నాబాలునిమీఁద నీకుఁ బూర్తిగఁ గోపము వచ్చినదనుకొనుము. వాఁడు నీకుఁ గనుపడినప్పుడు కఠినమగు మాటలచే వానిని దిట్టితి వనుకొనుము. తిట్టినతరువాత మంచిపనిని జేసితినని తలంప వచ్చును. కాని యొకపుస్తకమును జదువుటకుఁ బ్రారంభించి యందులో "అపకారికి, నపకారము చేయుటమంచిదిగాద"నియును దానివలన వానిమనస్సు మిక్కిలి చెడుననియును వానిలో నపకారము చేయవలయునను నిచ్ఛ మఱింత వృద్ధిఁబొందుననియును, వానిని గోపింపక యుపకారముఁ జేసినచో వాఁడు నిజదోషములను శీఘ్రముగఁ దెలిసికొని తన చెడు

స్వభావమునకు సిగ్గును దుఃఖమును బొందు మనియును గల యుపదేశమును జదివినప్పుడు నీవుచేసినపని బాగుగనుండలేదని యు నిఁక ముందెప్పుడు నిట్టి కార్యములను జేయుట యుచితము గాదనియుఁ దెలిసి కొందువు. కథలతోడను నవ్వులతోడను వినోదములతోడను గాలము వృథాపుచ్చుట యనర్థమని నీకుఁ దెలిసియుండవచ్చును. నీవేదయిన పుస్తకమునందుఁ గాలము, నిమిషముల తర్వాత నిమిషములు గంటల తర్వాత గంటలు గతించి పోవుట నీకుఁ దెలియు దనియును బోయిన కాలమెప్పుడును రాదనియును బెక్కండ్రు వ్యర్థముగాఁ గాలమును బోఁగొట్టుకొనుచున్నారనియు నామోదప్రమోదముల క్రింద వ్యర్థముగఁ బోయిన కాలమును జ్ఞానము సంపాదించుట కొఱకు గాని, ధర్మవిచారణయందుఁగాని లేక పరోపకారమునకుఁగాని వినియోగపఱచినచో, నీకు నితరులకు నెంతయో మేలుగలుగుననియును, గాలమును వృథాపుచ్చుటవలనఁ గలుగు నష్టము నీ జీవితమునం దెప్పుడును బూర్తిగా దనియును, మొదలుగాఁగల సంగతులను జదివిన తర్వాత నీమనస్సు నిద్రనుండి లేవకుండునా! వ్యర్థముగఁ గాలమును బుచ్చినందులకు విచారింప కుందువా! ఇఁక ముందెప్పుడును గాలమును వృథాపుచ్చనని స్థిరసంకల్పము చేసికొనకుందువా!

దుష్టులు సాధుమానవుల నెట్టి కష్టములను బెట్టినను నిప్పులలోఁబడఁద్రోసి తగులఁబెట్టినను, అసత్యవ్యవహారములకు సమ్మతించక తమప్రాణములకంటెను, సత్యము నెక్కువగఁ బ్రేమించి సత్యమును రక్షించుకొనుచు వచ్చిరని చదువునప్పుడు మనకు సత్యమునం దధికానురాగమును, నసత్యవ్యవహారము

లయం దనసహ్యాతయును గలుగ కుండునా? ధనము సుఖము గల సంసారము లందలి స్త్రీపురుషులు నిజసుఖములను బరిత్యజించి వైద్యాలయము లందలి రోగులకును బిచ్చివాండ్ర వైద్యాలయములయందలి పిచ్చివాండ్రకును, కారాగారాముల యందలి ఖైదీలకును సేవలు చేయుచు దినములు, దినములు గడపినారని చదువునప్పుడు మనస్సునం దుత్సాహము వృద్ధిగాకుండునా? సోమరితనము వదలి మానవసేవ జేయుటకు స్థిర సంకల్పము గలుగదా!

ఇంతవలన శాస్త్రములను బఠించినచో మనకెట్టియుపకారము గలుగునో తెలిసికొనఁగలుగుదుము. కావున బరమోపకారకములైన శాస్త్రములను జిరస్నేహితులుగఁ దలంచి యుండుట యుచితము. ఎప్పుడును శాస్త్రములను నిర్లక్ష్యము చేయఁగూడదు. శాస్త్రములను జదువుటయం దెప్పుడు నశ్రద్ధ చేయగిట్టదు. ఉపాధ్యాయులును, నాచార్యులును చేయునుపదేశములను శాస్త్రములయందలి మంచివాక్యములను, దృష్టాంతములను మనస్సునందు నెప్పుడు నుంచుకొనువారలకు, దుష్టభావములు దుష్టసంకల్పములు తలంపులును మనమునందుఁ బ్రవేశింపవు. పాఠశాలలోఁ జదువుట యందును, నింటిలోఁ బనిపాటలయందును గొంతకాలము గడపి, మిగతకాలము వ్యర్థముపుచ్చుటవలనను, బనికిమాలిన కోరికలు, పనికిమాలిన మాటలు నవ్వులు మొదలగువానితోఁ గడుపుచుండువారి మనస్సు, అన్యాయపుఁ గోరికలతోఁ బూర్ణమైయుండును. మఱియును వారు, సమాజముగఁ బరులను నిందించుట యందును బరులకపకారము చేయుటకును బూనుకొందురు.

కానఁ బాఠశాలయందుఁ జదువవలసిన నియమితగ్రంథములు కాక నియమానుసారముగ శాస్త్రగ్రంథములను జదువుకొనుచుండవలయును. సమయము దొరికినప్పుడెల్లను సాధుపురుషుల జీవనచరిత్రములు నుపదేశపూరితమగు గ్రంథములను జదువుకొనుచుండవలయును. శాస్త్రములను జదువుటయం దీ క్రింది నియమములను బాటించుటయుచితము. (౧) ఏశాస్త్రమును జదువుటవలన నీకుపకారముగలుగునో దానిని నీవుస్థిరపఱచుకొనుట కఠినము. కనుకఁ దల్లితండ్రి యాచార్యుఁడు మొదలగు జ్ఞానులు చెప్పినశాస్త్రములను జదువుకొనుము. (౨) అధమము దినమున కొకమారైనను శాస్త్రమును జదువుము. మనకుపకారకరమగు కార్యమును శ్రద్ధతోఁ జేసినకొలఁదిని మంచిది. అందువలన దినమునకొకమారు శాస్త్రమును జదువుట గొప్పలోనిది కాదు. ప్రతిదినమును జదువనిచోఁ జదువుట కభ్యాసము కుదురదు. మఱియును, ప్రతిదినమును సదుపదేశములు సదుపమానములు మనమునకు రానిచో మనమనస్సు నీచత్వమును బొందును. (౩) శాస్త్రములను గ్రహించుచుఁ జదువుము. చదువునప్పుడు తెలియని యంశముల నాచార్యుఁడు మొదలగు వారియొద్దనడిగి తెలిసికొని చదువుకొనుము. శాస్త్రములయందలి యుపదేశములను జింతన చేయుటయే కాక పాలనము చేయుటకుఁ బ్రయత్నింపుము. (౪) ఒకగ్రంథము నొకమారు చదివిన తర్వాతఁ దిరిగి చదువుటవలనఁ బ్రయోజనము లేదని తలంపఁగూడదు. ధర్మగ్రంథములను మాటిమాటికిని జదువుటవలన గ్రంథములందలి సదుపదేశములు సదుపమానములు చిరదినముల వఱకును మనస్సునందు నిలిచి యుండును. అందువలన

మనస్సు పవిత్రమగును. చరిత్రము బాగుపడును. ధార్మికమా నవు లందఱును మంచి మంచి శాస్త్రగ్రంథములను బెక్కుమాఱులు పఠించియున్నారు. మహాపురుషుల జీవితచరిత్రముల నన్నిటిని జదివియున్నారు. ఈ చదువు, వారి చరిత్రోన్నతికి ముఖ్యకారణమని తెలిసికొనుము. (గీ,) ప్రజ్ఞావివేకముల ప్రేరణము వలన శాస్త్రకర్తలు శాస్త్రములను రచియించియున్నారు. కనుక శాస్త్రములను జదివినచో మనప్రజ్ఞావివేకములు ప్రకాశమానము లగునుగాన శాస్త్రములు మన కాదరణీయములు. ప్రజ్ఞావివేకములు మనకు మాననీయము లగుటవలన శాస్త్రములు ముఖ్యముగ మనకు మాననీయములు. వివేకము దేనిని చేయుమని ప్రేరేపించుచుండునో యేది ధర్మమో దానిని జేయుట యుచితము. ప్రజ్ఞ దేనిని జెప్పునో దానిని సత్యమని విశ్వసించుట యుచితము. కాని, యేదయిన పుస్తకమునందుఁ జెడుకార్యములు చేయుమని యుపదేశములున్నచో వానిని పాలనము చేయనక్కఱలేదు. మఱియు నే గ్రంథమునందైనను భ్రమతోఁ గూడుకొన్న వాక్యము లున్నచో వానిని విశ్వసించుట యుచితముగాదు. స్వల్పదోషములు స్వల్పభ్రమలును గలవని విస్తారజ్ఞానపూర్ణములును బరమోపకారకములును నగు శాస్త్రముల నాదరింపకుండుట యుచితముగాదు.

ప్రశ్నలు.

౧. దేనిని శాస్త్రమందురు?

౨. ఎందువలన మనకు శాస్త్రము లాదరణీయములు?

౩. శాస్త్రమును జదువుటవలన మనకెట్టి యుపకారము గలుగును?

౮. శాస్త్రములను జదువుటవలనఁ గలుగు నుపకారములను గొన్నిటిని జెప్పుము.

౯. శాస్త్రములను జదువుటను గమనింపవలసిన నియమము లెవ్వి.

## త్రయోదశపాఠము — ముక్తి, ఉన్నతి.

వివేకము వలన నీశ్వరేచ్ఛను దెలిసికొన నగునని నీకుఁ దెలియ దనుకొనుము. ఈ పుస్తకమును జదువుటవలన నీ సంగతిని గ్రహించినా ననుకొనుము. కనుక నీపుస్తకమును జదివి నీ యజ్ఞానమునుండి, ముక్తిలాభమును, బొందితివి. నీ మనస్సును బంధించిన యజ్ఞానబంధనము లీపుస్తకమును జదువుట వలన విడిపోయినవి. అనఁగా, జ్ఞానములేని నీవు జ్ఞానమునుబొందితివి. పూర్వముకంటె జ్ఞానము వృద్ధియగుటవలన నీవు జ్ఞానోన్నతి లాభమును బొందితివి. ఈకార్యమును రెండుభావములుగఁ జెప్పవచ్చును. (౧) ముక్తిని బొందుట (౨) ఉన్నతిని బొందుట.

నీ చెల్లెలిమీఁద నీ కంతగాఁ బ్రేమలేదనుకొనుము. స్వల్పకారణములవలన నామెతోఁ బోట్లాడుట నభ్యసించిన దనుకొనుము. సామాన్యమైన యన్యాయకార్యమును జేసినందువలన నామెమీఁద నీకు విస్తారము కోపము గలిగిన దనుకొనుము. ప్రేమలేకుండుటయునుఁ గోపము చెందియుండుటయును గొప్ప యధర్మములని నీవుదెలిసికొనునప్పుడు కోపమురాకుండుటకుఁ

బ్రయత్నింతువు. నీవామెకు ఫలాహారములను బెట్టి యాడుకొను వస్తువులనిచ్చి పాఠమును జెప్పుట మొదలగు కార్యములను జేసినచో నీకామెయెడల విస్తారము ప్రేమగలుగును. కార్యము వలనఁ బ్రేమ కుదిరినది. నీమనస్సునందుఁ గోపము పోయినది. మనస్సునందుఁ బ్రేమప్రవేశించినది. ఈకార్యమునుగూడ రెండు విధములుగ వర్ణింపవచ్చును. (౧) ఆప్రేమ కోపము నుండి ముక్తిలాభమును బొందినావు. (౨) ప్రేమోన్నతి లాభమును బొందినావు. ఒకనికి మనస్సునందహంకారము ప్రబలముగాఁ గల దనుకొనుము. అనఁగా, నేను బాగుగఁ బాఠమును నొప్పగింపఁగలను, బాగుగ లెక్కలను వేయఁగలను, బాగుగ వ్యాసములు వ్రాయఁగలను, బాగుగ సంగీతము పాడఁగలనని సర్వదా భావించుచు నెప్పుడును బంధువుల యొద్దను స్నేహితుల యొద్దను దన సమర్థతను జెప్పుకొనుచు, నెల్లప్పుడు దన్నుఁదాను బొగడుకొనుచుండు ననుకొనుము. వాఁడొకదినమున నుపాధ్యాయుని వలన, నా యహంకారము చెడులక్షణ మనియును, నీ యహంకారము గలవారలు మహాపాపులనియును, వినినప్పటి నుండియు నహంకారమును విడుచుటకుఁ బ్రయత్నించు చుండునుగదా మఱియును వాఁడు తనకంటె బాగుగ వ్యాసములు వ్రాయగలవారును జక్కఁగ సంగీతమును బాడఁగలవారు నగు బాలురను జూచినప్పుడుఁ గొంచె మప్పగించఁ గలిగినను వ్రాయఁగలిగినను పాడఁగలిగిన నాకొంచెము శక్తియును వారి నిజశక్తి గాదనియు నీశ్వరుఁడు సర్వదా మన మనస్సునకును, శరీరమునకును శక్తి నిచ్చుటవలన మన మీకార్యములను జేయఁగలుగుచున్నా మనియును, నాయన యొక్క నిమిషము శక్తినీయని యెడల మన స

మస్తకార్యములును నిలిచిపోవుననియును మొదలగు నంశము
లను భావనచేసి యీశ్వరుని సమీపమునఁ బ్రార్థనఁ జేయుట
వలనవాఁ డహంకారమునకు దూరమగును. వాని మనమున
వినయము ప్రవేశించును. దీనిని రెండు విధములుగఁ జెప్పవచ్చు
ను. (౧) అహంకారమునుండి ముక్తిలాభమును బొందినాఁడు.
(౨) వినయమువలన నున్నతి లాభమును బొందినాఁడు.

మీరిపుడు ముక్తియని దేనినందురో యున్నతియని దేని
నందురో గ్రహించియె యుందురు. "ముక్తి" "ఉన్నతి" యనునవి
యొకటే వస్తువని తెలిసికొనుఁడు. మొదటి యుపమానమును
జ్ఞానసంబంధమునను, రెండవ యుపమానము ప్రేమసంబంధము
నను, మూఁడవయుపమానము పవిత్రతసంబంధమునను, సూచిం
చి యున్నాను. అజ్ఞానమును విడనాడి జ్ఞానమును బొందుట
యప్రేమను వదలి ప్రేమలాభమును బొందుట యపవిత్రతను
త్యజించి పవిత్రతాలాభమును బొందుటపేరే ముక్తియందురు.
మఱియును దీనిపేరే యున్నతియందురు. ముక్తిలాభమును బొం
దుట, జ్ఞానము ప్రేమ పవిత్రతలవలన నున్నతిలాభమును బొం
దుటయే మనకుఁ బరమ మంగళప్రదము. ఇదియె మనజీవితము
యొక్క ప్రధానకార్యము. ఈకార్యము రాఁగల కాలమున నె
ప్పుడో యొకప్పుడు చేయవచ్చునను కార్యముగాదు. ఈకార్య
మును మనమెప్పుడును చేయుచున్నాము. మఱియును, జేయు
చుండవలయును. మీరు ప్రతిదినము పాఠమును జెప్పించుకొని
చదువుటవలన మీరజ్ఞానమునుండి ముక్తిలాభమును బొందు
దురు. మఱియును జ్ఞానోన్నతిని జెందుదురు. ప్రతిదినము తల్లి,
తండ్రి, అన్న, అక్క, తమ్ముఁడు, చెల్లెలు మొదలగువారికి సేవ

చేయుటవలన నపేక్షనుండి ముక్తిని బొందుదురు. మఱియును ప్రేమోన్నతి లాభమును బొందుదురు. ప్రతిదినమును చెడు కోరికలు చెడుమాటలు చెడుకార్యములు పరిత్యజించి మంచి కోరికలు మంచిమాటలు మంచికార్యములు చేయుచుండుటవలన నపవిత్రతనుండి ముక్తిని బొందుదురు. పవిత్రోన్నతిలాభము ను బొందుదురు. ముక్త్యున్నతుల లాభములను బొందుటయే మనయొక్క సకలకార్యములకును లక్ష్యము. మనము దీనికొఱకై యనేక కార్యములను జేయుచున్నాము. అన్ని సత్కార్యము లందును నీలాభమును బొందుచున్నాము. ఈశ్వరుండందఱి మనస్సులయందుండి వివేకమువలనను ధర్మాధర్మములను దెలియఁజేయుచున్నాఁడు. ప్రజ్ఞవలనను సత్యాసత్యములను దెలియఁజేయుచున్నాఁడు. సకలదేశములయందును సకలకాలములయందును ప్రజ్ఞావివేకములవలన నమృద్ధముచుండిన జ్ఞానులు సాధుపురుషులు ననేకోపదేశములుచేసి శాస్త్రములు లిఖించి మనకు మహోపకారము నొనర్చియున్నారు. మన మీసమస్తమైన సాధుపురుషుల యొక్కయు శాస్త్రముల యొక్కయు న సహాయమును బొందుటవలన ముక్తియున్నతుల లాభములను బొందుదుము. దయామయుఁడును సమస్తమైన వారిని బ్రేమించువాఁడు నగు నీశ్వరుఁ డెల్లమానవులకును ముక్తిని బ్రసాదించును. ముక్తినుండి యెవరిని వంచింపఁడని సహజముగ మనము దెలిసికొనవచ్చును.

ఈశ్వరుఁడు సమస్తదేశములయందును సమస్తకాలముల యందును సకలసాధుపురుషులను సకల శాస్త్రములను నేర్పాటు చేసియున్నాఁడు. అందువలన నెవరో యొక సాధుపురుషుని యు

పదేశమును మాత్రమేకాని యేదోయొక శాస్త్రమును మాత్రమేకాని మన్నించనందువలన ముక్తిరాదనుట సత్యముగాదు. సత్యప్రేమ పవిత్రతలే ముక్తి. ఏ యాచార్యునివలనఁ గాని యే శాస్త్రములవలనఁగాని దీనిలాభమునుబొందినను బొందకున్నను నిదియొక వస్తువే. ఆచార్యులు శాస్త్రములు భిన్నాభిప్రాయమును బొందవచ్చునుగాని సత్యము మాత్రము భిన్నముగాదు. "ఈశ్వరప్రియకార్యములు చేయుట యుచితము" ఇది యొక సత్యము. దీనివలనముక్తి గలుగును. ఈవాక్యము మనదేశమునందుజన్మించిన యాజ్ఞవల్క్యమునియును, యూదుదేశమునందు జన్మించిన సాధుపురుషుడగు యేసుక్రీస్తును నరబ్బీదేశమునందు జన్మించిన సాధుపురుషుఁడగు మహమ్మదును జెప్పియున్నారు. ఈసత్యముపనిషత్తులు, బైబిలు, ఖొరానులయందును వ్రాయబడియున్నది. ఈసత్యమును ముగ్గురు సాధుపురుషులు చెప్పుటయందును మూఁడుశాస్త్రముల యందలి వ్రాతలయందును గొంచెమైనను భిన్నముగాక యేకత్వమును బొందుచున్నది.

ఇందువలన నీ సత్యము నెవరి ముఖమునసుండి వినినను, నేశాస్త్రమును జదివి తెలిసికొన్నను మనకు ముక్తిగలుగును. ఈ సత్యమును క్రైస్తవులయొక్క బైబిలునుండియే దీసికొనవలయుననియు, నటుగానిచో ముక్తిరాదనియు నెవరైనఁ జెప్పవచ్చును గాని యీమాటలు నిజముగానని సహజముగఁ దెలిసికొందుము. ప్రేమను బవిత్రతను నుపదేశించిన సాధుపురుషు లేదేశమువారైన నేకాలమువారైనను సత్యము ప్రేమ పవిత్రతనుగూర్చి వ్రాయఁబడియుండిన శాస్త్రము లేదేశములోని వైన నేకాలమునందలి వైనను మన గభీరభక్తికిఁ బాత్రములు.

ముక్తికి సహాయముచేయు విషయము లెచ్చట దొరికినను మన మాదరముతోడ గ్రహించుట యుచితము.

ప్రశ్నలు.

౧. దేనిని ముక్తియందురు?

౨. దేనిని ఉన్నతియందురు?

౩. ముక్తి, యున్నతి యొకటేయని యుపమానముల వలన ఋజువుచేయుము.

౪. జ్ఞానోన్నతి కొక యుపమానమును జూపుము.

౫. ప్రేమ పవిత్రతల కొక యుపమానమును జూపుము.

౬. ప్రతిదినమును ముక్తిలాభమును బొందవలయునను వాక్యమున కర్థమును జెప్పుము.

౭. దేనివలన ముక్తి గలుగును?

౮. "ఏదోయొక శాస్త్రమును మన్నించ నందువలన ముక్తి రాదు" అనువాక్యమునందలి భ్రమను జూపింపుము.

౯. మహాపురుషులు సాధువులు, భిన్నభిన్న శాస్త్రములు నను నీ విషయమున మనకర్తవ్యమెద్ది?

## చతుర్దశపాఠము—పరకాలము.

ఆత్మ, శరీరము వేఱువేఱు పదార్థములని మీరు పంచమపాఠమునందుఁ జదివియున్నారు. కాన నీ భిన్నత్వమును

బాగుగ గ్రహింపుఁడు. ఆత్మశరీరమును దెలిసికొనును. మఱి యును దన్నుఁదాను జ్ఞాతయని తెలిసికొనును. కాని శరీరము తన్నుఁ దాను దెలిసికొనఁజాలదు. ఆత్మనుగూడఁ దెలిసికొనఁ జాలదు. ఆత్మ శరీరమును నడిపించును. మఱియును శరీరము మూలమున నన్యవస్తువులను నడిపించునుగాని, శరీరము తన్ను దానుగాని, యేకొంచము నైనవానిఁగాని నడిపింప జాలదు. శరీరమింకొక దాని వలన నడిపింపఁబడును. అనఁగా శరీరము "జడము" ఆత్మ "చేతనము" ఇదియే వీని భేదము.

ఆత్మ శరీరములు భిన్నములైనప్పుడు శరీరము నష్టమైనచో నాత్మకూడ నష్టమగునని తలంచుట యుచితము గాదు. మరణించినచో శరీరము యొక్క సమస్త కార్యములు నిలిచి పోవును. ఉచ్ఛ్వాస నిశ్వాసములు నడచుట, రక్తము క్రిందికి మీఁదికిఁ బారుచుండుట మొదలుగాఁగల కార్యము లన్నియు నాఁగిపోవును. ఇందువలన నాత్మగూడ మరణించినదని చెప్పుటకుఁ గారణములులేవు. జ్ఞానము, ప్రేమ, భక్తి, మంచికోరికలు, మంచి ప్రతిజ్ఞలు మొదలగు కార్యములన్నియును ఆత్మ వైయున్నవి. కాని, శరీరమునకు లేవు. ఈసకల కార్యములు నాత్మ శక్తివలన నగుచున్నవి.

ఈశ్వరుఁడు మనలఁ బ్రేమించుచుండువిషయము షష్ఠ పాఠమునందుఁ జదివియున్నారు. ఈశ్వరుఁడు తాను బ్రేమించు చుండువారినెందులకుఁ జంపివేయును; ప్రేమాస్పదమైన వానినెప్పుడును దనయొద్ద నుంచుకొనుటకు నిచ్ఛగలుగును. వానిని దూరముగనుంచినచో మిక్కుటమగు కష్టము గలుగును. ఇందువలన వానిని జంపివేయుట యసంభవము. ఈశ్వరుఁడు

మనశరీరము నెప్పుడో యొకప్పుడు నశింపఁజేయు ననుటకు సంది
యము లేదు. శరీరముతోఁగూడ నాత్మనుసయితము నశింపఁజేసిన
చో నీశ్వరుఁడు కఠినుఁడని చెప్పవలసివచ్చును. ఆయనను దయా
మయుఁడని చెప్పుటకువీలు లేదు. దయామయుఁడును మనలఁ బ్రే
మించువాఁడును మనమంగళమును గోరుచుండువాఁడును, నగు
నీశ్వరుఁడు మనలను జంపివేయుననుటను గొంచమైనను విశ్వసిం
పరాదు.

ఆయనమనచేతఁ జేయించు కార్యములను జూచినచో మన
లను జంపివేయునని నమ్ముటకు వీలు లేదు. ఆయనజగత్తునందేవిధ
మగువ్యవస్థనుగల్పించియున్నాఁడో యాయనజగత్తు నేవిధముఁగ
నడిపించుచున్నాఁడో భావించిచూడుము. ఇందువలననన్నియాత్మ
లయొక్క క్రమాగతజ్ఞానము, ప్రేమ, భక్తి, పవిత్రత, మొదలగు
మంచిగుణము లన్నియును, గలుగుచున్నవి. ఈక్రమోన్నతివిష
యమును మీరు బాగుగ యోజించి చూడుఁడు. పిత, మాత,
ఆచార్యుఁడు, ఉపాధ్యాయుఁడు, శాస్త్రములు మొదలగువాని
సహాయమున మనము క్రమాగతముగ ధర్మశిక్షను బొందుచు
న్నాము. విద్యాభ్యాసము, ఉపాసన, మంచికోరికలు, మంచికా
ర్యములు, మొదలగువాని మూలమున నాత్మ క్రమముగ, జ్ఞాని
యును, ప్రేమగలదియును, బవిత్రము నగుచున్నది. ఈయున్న
తియే మనకుఁ బరమమంగళప్రదము. ఈమంగళముకొఱకుఁ గా
ను మనము నేకసమయములందనేక కష్టములను బడుచుందుము.
విద్యనభ్యసించుట కెన్నియో కష్టములను బొందవలయునుగదా.
చెడుకోరికలు చెడుతలంపులు దూరము లౌవుట కెంతయో

యాయాసమును బొందవలయునుగదా. ఇతరులకు శుశ్రూషలు చేయుటవలన నెంతయో శ్రమగలుగునుగదా.

ఆత్మ యున్నతిని జెందుటకు మనమెన్నియో కష్టములను ధైర్యముతో సహింతుము. మనమున్నతి లాభమును బొందుటయే యీశ్వరేచ్ఛయని సహజముగఁ దెలిసికొనఁ గలుగుదుము. ఆయనకీ యిచ్ఛ లేనిచో వివేకమువలన నెల్లప్పుడును ధార్మికులుగుండని చెప్పుచుండడు. మనము ధార్మికులముగావలయునని యాయన తలఁచకున్న యీ యసంఖ్యేయ వస్తువులను జేసియుండఁడు.

కనుక నసంఖ్యోపాయములతో మన యాత్మోన్నతి నిమిత్తము సదుపాయములను జేసియున్న యీశ్వరుఁ డాత్మలను జంపివేయునను విషయమును భావించిచూచిన విశ్వసింపనగునా? రెండుమూఁడు దినముల తరువాతఁ జంపవలయునను కోరికగల వాఁడు మనయున్నతి కన్ని వస్తువులను సిద్ధముచేయఁడు. ఈ ప్రయత్నములవలన నాత్మను చిరకాలము రక్షించి, క్రమాగతోన్నతి కెక్కఁజేయుటయే యీశ్వరేచ్ఛయని ప్రకాశమానమగుచున్నది. ఆత్మవినాశమువలన జ్ఞానము, ప్రేమ, పవిత్రత, నష్టమగును. ఎంతో ప్రయత్నముతోడ జ్ఞానమును బవిత్రతను బ్రేమను సమకూర్చిన యీశ్వరుఁ డొక్కపెట్టున వీనినన్నిటిని వినాశము జేయుననుమాట విశ్వసింపఁదగినదిగాదు. ఇందువలన నాత్మకు మరణము లేదని తెలిసికొనుచున్నాము. ఈశ్వరుఁడు చేయు నాశనము వలనను దీనికి నాశనము లేదు. శరీరము నాశనమైనపిమ్మట నీశ్వరుఁడాత్మ నేయుపాయమున నున్నతికిం దెచ్చునో, యేభావమున నుంచునో యనుసంశయమును మనము నిశ్చిత

రూపమునఁ దెలిసికొనఁజాలకపోవచ్చును. స్పష్టముగ గ్రహింప లేక పోవచ్చును. కాని యీశ్వరున కాత్మయందుఁగల యపార ప్రేమనుబట్టియు నాత్మయొక్క క్రమోన్నతిని నాత్మకు మరణ ము లేదని మనముస్పష్టముగఁ దెలిసికొనుచున్నాము. మరణ మునకుఁ బూర్వమందును, బరమందు నాత్మగలదు.

ప్రశ్నలు.

౧. ఆత్మకును శరీరమునకును భేద మెక్కడ?

౨. "శరీరనాశనముతోఁబాటు ఆత్మనాశనమును బొం దును" ఈ వాక్యమునందు గల భ్రమను జూపుఁడు.

౩. ఎందువలన నీశ్వరుఁడు మనలనువినాశము చేయఁడు?

౪. ఆత్మయొక్క క్రమోన్నతి యను వాక్యమున కర్థ మేమి?

౫. ఈశ్వరుని యిచ్ఛ క్రమోన్నతియని యెటులు తెలిసి కొన నగును?

౬. ఆత్మయొక్క క్రమోన్నతినిజూచి పరకాల సంబంధ మున నేమి గ్రహింపఁగలుగుదుము?

## పంచదశపాఠము—జాతిభేదము.

---

మనుష్యులందఱీశ్వరపుత్రులు. అందువలన, నే మను ష్యుఁడును మన యసహ్యతకుఁ బాత్రుఁడుగాఁడు. పశుప్రాయులైన వారిని నొకతండ్రియొక్క బిడ్డలువలె భావించి ప్రేమించుట యు

